# రవీంద్ర దర్పణం



రచన:

దోనేపూడి రాజారావు.

విజయసారధి పబ్లికేషన్స్

విజయవాడ-2.

అంకితము

సాహితీలోక బాంధవుడు
విశ్వకవి రవీంద్రుని అంతేవాసి అయిన
డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారికి
అభినందన సమర్పణము.

—రచయిత.

రవీంద్ర శత జయంత్యుత్సవ
సందర్భమున ఆంధ్రప్రభలో
ధారావాహికముగా
ప్రచురించబడిన వ్యాసములు

# దివ్యాత్మ

హిమాలయంవంటి నిశ్చల స్వభావం-యశోజ్జ్వల ఉన్నత ఫాలభాగం, వ్యక్తిత్వంలో కవిత్వం - కవిత్వంలో వ్యక్తిత్వం, వైభవశాలి - ప్రతిభాశాలి, రాజపురుషుడు - రాజర్షి, కవిసామ్రాట్ - సామ్రాట్‌కవి, జన్మ జాతకవి- యివన్నీ రవీంద్రుని దివ్యాత్మస్వరూపానికి ప్రతిబింబాలు.

82 సంవత్సరాలు - దాదాపు ఒక శతాబ్దంపాటు జీవితంలో యుగయుగాలను ప్రతిబింబింప జేసిన దివ్యాత్మ రవీంద్రుడు. నవభారత నిర్మాతల్లో యుగపురుషులుగా ప్రజా మన్ననల్ని పొందిన దివ్యాత్మలు రవీంద్రుడు-మరో దివ్యాత్మ గాంధీమహాత్ముడు. శాంతినికేతనం అటు రవీంద్రుని నిర్మాణంగా - సేవాగ్రామ్ యిటు మహాత్ముని నిర్మాణంగా నేటికీ అక్షయమై వెలుగొందుతున్నాయి.

రవీంద్రుడు సౌందర్యశిల్పిగా రూపొందితే, మహాత్ముడు సత్యశిల్పిగా నిలచాడు. వొకరు కవిత్వానికి - మరొకరు తత్వానికి నిలయాలయ్యారు.

శాంతినికేతనం, జీవితాని కదొక ఆరోగ్య మందిరం. సేవాగ్రామం, రుగ్ణజీవితానికదొక ఆధ్యాత్మిక ఆరోగ్య మందిరం. వొకాయన శాంతినికేతనాన్ని క్యాంపుగా పేర్కొన్నాడు. మరొకాయన సేవాగ్రామాన్ని 'సోషలిజానికి నర్సరీ' లాంటి దన్నాడు.

మహాత్ముడిది సోషలిజం – అదే సర్వోదయం. రవీంద్రుడిది రొమాంటిసిజం – అదే భావోదయం. మహాత్ముడిలో ఏదో వొక మహాశక్తి చోటుచేసుకుంది. రవీంద్రునిలో ఏదో అనురక్తి దాగి దాగి తొంగిచూసింది. మహాశక్తితో మహాత్ముడు సమాజాన్ని సేవించాడు. అనురక్తితో రవీంద్రుడు సాహిత్యాన్ని ఉపాసించాడు.

వొకాయన జీవితంలో సామంజస్యం సాధించాడనుకుంటే, మరొకాయన కళల్లో సామంజస్యం చూపెట్టాడు. వొకాయనకు ఖద్దరు ఆదర్శం–మరొకాయనకు తాజ్ మహల్ ఆదర్శం అయింది. వొకాయన ఖద్దరులో జాతీయ తత్వాన్ని తొంగిచూస్తే – మరొకాయన అంతర్జాతీయతకోసమని ఖద్దరును నిషేధించాడు. ఖద్దరులో రవీంద్రునకు 'హార్మనీ' తత్వం కనుపించలేదు.

వొకాయన శివత్వంకోసం సత్యాన్ని ఆరాధించగా, మరొకాయన శివత్వంకోసం సౌందర్య మార్గం అనుసరించాడు. అవడానికిద్దరూ వైష్ణవభక్తులే. అయినా వొకరు రాముని ఆత్మాహుతిని అనుష్ఠించగా, మరొకరు కృష్ణుని సహృదయతను పోషించారు. విభిన్న తత్వాలతో వొల్లు చేసుకున్నా, ఆత్మశుద్ధి, అంతఃశుద్ధి యిద్దరిలోనూ పూర్ణంగా అభివ్యక్తమైంది.

913 సంవత్సరం నోబుల్ ప్రైజ్ తో రవీంద్రుని భావ యుగం భారతదేశంలో ఆరంభమైంది. 1920 నాటికిగాని గాంధీమహాత్ముని సత్యాగ్రహ ఆందోళన ప్రారంభం

కాలేదు. ఒకరకంగా గాంధీ యుగంకి పూర్వమే రవీంద్ర యుగం మనకారంభమైందనవచ్చు.

బ్రహ్మసమాజంతో ఒక కొత్తదనం - ఆంగ్లప్రభావంతో మరొక వినూత్న అభివ్యక్తిని రవీంద్రుడు మనకందించాడు జీవితానికొక బ్లాంకోవర్సులాంటి ముక్తతను అందించాడు ఎంతటి కవిర్మనీషి అయినా ఆస్థాన కవిగా అమ్ముడుపోలేదు. ఎంతటి వైభవశాలి అయినా ప్రతిభకు లోటుపడలేదు. లక్ష్మీపుత్రుడుగా జన్మించి సరస్వతీ పుత్రుడుగా వృద్ధిచెందాడు పంజాబులో జరిగిన హత్యాకాండకు నిరసనగా ఆంగ్లేయులిచ్చిన 'సర్' బిరుదును తృణప్రాయంగా విసర్జించిన దేశభక్తుడు రవీంద్రుడు. ఆంగ్ల పరిపాలన్ని కాదన్నా ఆంగ్లసంస్కృతితో మన ఆర్ష జీవితానికి న్యూట్యూన్ను కట్టాడు. ఆర్ష ఆత్మను ఐరిష్ మ్యూజిక్‌తో ఆలాపించాడు. ఆంగ్ల సంపర్కాన్ని అభివ్యక్తిగా కూర్చుకొని ఆర్ష సంస్కృతిని ఆత్మగా ఆరాధించాడు.

రవీంద్రుడు వైష్ణవ కవిగనుక కవిత్వంలో ప్రేమ విరహాల మాధుర్యాలను గానంచేశాడు. వంశీధరుడ్ని అంతర్యామిగా అనుష్ఠించాడు. భావకవి గనుక చిత్రలేఖనంలోసైతం మానసిక స్థితిగతుల్ని అభివ్యక్తం చేశాడు. ప్రతిగీతంలో కుహూకూ, ఏదోవక కుతూహలం, ముగ్ధత, మోహం, వ్యథ అంతర్గతంగా ప్రవేశపెట్టాడు.

'గీతాంజలి' భక్తిబోధగా నిలబడితే, ఊర్వశి సౌందర్య బోధగా రూపొందింది. తతిమ్మా గద్య రచనలు సమవేదనకు ప్రత్యక్ష ప్రమాణాలయ్యాయి అది ఆయన మానవత అదే ఆయన దివ్యాత్మకు ప్రతిరూపం.



# ఆరణ్యాక జీవితం

జీవితం – వేదాంతం రెండూ కలసికట్టుగా పనిచేసిన కారుణ్యాదినాలు – ఆ ఆదిమయుగం తిరిగి ఈనాటికి ఆదర్శ జీవితం అయింది. సైన్సు–ఆధ్యాత్మికతల సమన్వయ జీవితం కావాలనే కాంక్ష నేడున్న డిమాండ్సుల్లో మొదటిది. ఈ డిమాండు యూనివర్సల్‌గా రూపొందింది. దీన్ని అనుభవంలోకి తీసుకురావాలని ప్రతి మానవుడూ, మూల మూలల నుండి తహతహలాడుతున్నాడు. సమన్వయ జీవితం అనుభవగమ్యం అయ్యేవరకూ అది ఆదర్శ జీవితమే. అనుభవానికి వచ్చిన మరుక్షణం నుండి అది ఇక ఆదర్శంగా నిలువక—వాస్తవిక జీవితంగా మారిపోతుంది. ఈవిధంగా ఒకనాటి ఆదర్శం మరోనాటికి వాస్తవికం కాక తప్పదు.

ప్రజాస్వామికం ప్లేటో కాలంనాడు మహా ఆదర్శంగా ఉండేది. ఆ ప్రజాస్వామికమే నిన్న మొన్నవరకు ఆదర్శ రాజ్యంగా ఉన్నా, నేడది వాస్తవిక రాజ్యం – వాస్తవిక జీవితంగా మారింది. ప్లేటో ఆదర్శరాజ్యం స్థానంలో మరో రాజ్యం కావాలనే కాంక్ష – ఆదర్శం, ప్రపంచ ప్రజల్ని కలవర పెడుతున్న దనడంలో సత్యం లేకపోలేదు.

ఆధ్యాత్మికతతోపాటు ఆనాటి ఆరణ్యకజీవితం కూడా తిరిగి ఈనాటికి ఆదర్శమైంది. ఆరణ్యక జీవితం వేదాలతో

ఆరంభించి ఉపనిషత్ కాలంనాటికి పరిపక్వదశ నందుకొంది. ఆనాడు రాజు - ప్రజ అనే తారతమ్యం లేకుండా అంతా వానప్రస్థానం చేసేవారు. ఋషి స్వభావంతో రాజ్యం చేసిన రాజులకూ కొదవలేదు. జనకమహారాజు ఇలాంటివాడు. జీవిత పూర్ణత్వంకోసం వానప్రస్థానం చెయ్యడం మహదాశ యంగా వుండేది. అది మానవుని ఆధ్యాత్మిక జీవితానికి ప్రశాంత వాతావరణం. ప్రకృతి బాహ్యాంతరాల్లోనూ పర మాత్మను దర్శించి తాదాత్మ్యం పొందేవారు. జీవితాన్ని ధన మదాలకు దాస్యం చేసేయక చతుర్ధాశ్రమాలుగా విభ జించి ఎక్కడి కక్కడే హద్దు మీరకుండా పరిమితం చేసే వారు. హద్దు మీరి ఏపని చేసినా అది అత్యాచారంగానే మారుతుంది. తన విధ్యుక్త ధర్మాన్ని తాను చెయ్యక పోయినా అథవా ఎక్కువ చేసినా, లేక తక్కువ చేసినా అది రెండవవానికి - పొరుగువానికి భారమే అవుతుంది. ఇది గుర్తించే తండ్రీ - కొడుకులు, రాజూ - ప్రజలు తమ తమ పరిమితుల్లో పరస్పర ప్రేమానురాగంతో ప్రశాంత జీవితం గడిపేవారు.

ఈ యుగంలోనూ ఆనాటి ఆరణ్యకులకు కొరత లేదు. రామతీర్థ - రామకృష్ణులు, అరవింద - రవీంద్రులు ఈ కాలంనాటి ఆరణ్యకులు. తపోవన జీవితానికి విశ్వజనీనత నాపాదించి ఆరణ్యక జీవితాన్ని ఆత్మజ్ఞానానికి మహాసాధ నంగా స్వీకరించారు. ఈ తపోవన జీవితం ఐహిక జీవితానికి

ఏమాత్రం అవరోధమూ కల్పించ లేదు. పైగా ఐహిక జీవన వికాసానికే చేయూత నిచ్చింది.

రవీంద్రుడు తన తపోవన జీవితాన్ని గురించి యిలా వ్రాశాడు – వనం సజీవమైన వస్తువు. ఎడారి – సముద్రం– రాతి ప్రదేశం నిర్జీవాలు. వనం జీవితానికి ఆశ్రయం–పోషణ యిస్తుంది. పూర్వకాలంలో ఆరణ్యకులు తపోవనవాతావరణంలో విశ్వాత్మను దర్శించారు. అద్వైతాన్ని పెంపొందించారు. రాజనీతికి, ఆశ్రమ జీవితానికి పొత్తుకుదరదు శాంతి నికేతనం అర్థవంతమైన సంస్థ. ఈ శాంతినికేతనం ద్వారా ఆధ్యాత్మిక మిషన్ నడుపుతాను శాంతినికేతన స్థాపనలో ఆధ్యాత్మిక ఆనందమే ప్రధానోద్దేశ్యం. ఇది రవీంద్రుని యూనివర్సిల్ అపీలు.

ఆయన స్వతంత్రభావాలు – నిర్వికారమైన అంతఃకరణ శాంతినికేతనాన్ని అతి త్వరలో విశ్వభారతిగా మార్చివేశాయి. ధార్మిక వివాదాలకు అతీతంగా వుంటూ ప్రేమానుభూతిద్వారా పతివ్రతా ధర్మంలాంటి భగవత్ప్రేమను వ్యక్తం చేశాడు. 'బ్రహ్మ యే వొక్క దేశీయుడూ కాదు – సర్వవ్యాపకుడు.' అని తన దైవాన్ని రామ–కృష్ణ–రహీములనే సాంప్రదాయిక నామకరణాలతో సమ్మిళితం చెయ్యక – యూనివర్సల్ అపీలునిచ్చే 'సుందర్' అనే నామంతో పిలుచుకున్నాడు – తన దైవం ఎదుట తనొక అర్థిగా చెప్పుకున్నాడు. సమాజంలో తనొక సామాన్య మానవుడుగా కూడా పేర్కొన్నాడు.

ఏ మహాపురుషుడూ - ఏ ఆశ్రమవాసీ ఇంతవరకూ తనొక్క గొప్పవాడుగా చెప్పుకోలేదు. వారు లోకానికి మహాపురుషులు, మహాత్ములు కావచ్చు. వారికి వారు మాత్రం సామాన్యులే. సర్వత్రా ప్రతి వస్తువును అశాశ్వతంగా నిరూపించి చివరకు తనకున్న కీర్తి సంపదను సైతం కాలగర్భంలో కలిసిపోయే పూచిక పుల్లగా వ్యాఖ్యానించి స్వాత్మయెడ మాత్రం మహావిశ్వాసం ప్రకటించారు.

'తేనత్యక్తేన భుంజీతాః' గీతా ప్రవచనం మహాపురుషుల జీవితాల్లో నాటినుండి నేటికీ ఇతరులకు బాధ కలిగించకుండా త్యాగాన్నే భోగంగా జీవన ఆనందంగా — అణిముత్యంగా ప్రకాశిస్తూ వచ్చింది. మహాపురుషుల జీవితాలు లోకానికి శాంతి విశ్రాంతులే ప్రసాదించాయి. రవీంద్రుని తపోవన జీవితం సైతం పిత్రార్జితం. తండ్రి దేవేంద్రనాథు ఠాకూ మహర్షి. ఆయన తన జీవితాన్ని ఉపనిషత్తుల పంథాలో పరోపకారానికి ప్రతీకగా లోకానికి ప్రదానం చేశాడు. ఆయన జీవన తత్వాన్ని ప్రకటించే మూడు వాక్యాలు శాంతినికేతనంలో ఆయన సమాధిపై క్రింది విధంగా చెక్కబడి వున్నాయి.

తిని ప్రాణేర ఆరామ్!
మనేర ఆనంద్!
ఆత్మార శాంతి!

'ఆయన, ప్రాణాలకు విశ్రాంతి_మనస్సుకు ఆనందం_ ఆత్మకు శాంతి అయివున్నారు'.

రవీంద్రుడు నిండు యౌవనంలోనే వానప్రస్థానం చేసిన మహాత్యాగి. మహాత్యాగిగా, ఆశ్రమవాసిగా సాధు జీవితాన్ని స్వీకరించినా సాధుజీవితంలోని విరక్తిని మాత్రం పరిగ్రహించక సంసారికి కావలసిన అనురక్తినే రుచి చూసేడు – సపరివార సకుటుంబంతో నివసించేడు–సంపన్న గృహస్థుగా ఏటేటా జన్మోత్సవాలు చేసుకున్నాడు. రాజ శివిలో వేదికపై ఆశీనుడయ్యేడు–మృష్టాన్నాలే భుజించేడు. భార్యతో రకరకాల పిండివంటలు చేయించుకున్నాడు. భార్య మృణాళికి పిండి వంటల్లో మాలతీచందూరుకు మించిన పాకశాస్త్రానుభవం వుండేది. కొన్ని వంటకాలు తానే చెయ్యిచేసుకొని భార్యకు చేసి చూపించేవాడు. 'మీరు అన్నింటిలోనూ ఆచార్యులే' నని విసుకుకుంటూ వుండేది. ఇంతే కాదు – పిల్లలకు పాలుపట్టి, బట్టలు వేసే వాడు. ఇదంతా రవీంద్రుని త్యాగంలోని భోగజీవితం.

రవీంద్రునకు విరక్తి జీవితం సరిపడేది కాదు. డార్విన్ వికాసవాదంలో నమ్మకం కుదిరిన రవీంద్రునకు జీవితం పరిణామక్రమాన్ని కలుపుకుంటూ వస్తున్న ఒక అవిచ్ఛిన్న ప్రవాహంగా కనిపించింది. డార్విన్ వికాసవాదాన్ని స్తుతించిన రవీంద్రుడు సృష్టి పూర్ణబిందువునుండి – పరమనాదం నుండి ప్రారంభమైందని హఠయోగిగా ఎలా చెప్పగలడు ? రవీంద్రుడు హఠయోగ సాధనకోసం – పరతత్త్వం కోసం భౌతిక జీవితాన్ని త్యజించిన సర్వసంగపరిత్యాగి కాదాయె! సమాధిస్థుడై శరీరాన్ని శుష్కింపజేసిన పతంజలి కాదాయె!

ప్రాణాయామంకోసం స్త్రీని నిందించి - త్యజించిన యోగి అసలేకాదు, పైగా స్త్రీని పత్ని - ప్రేయసి - తల్లి - చెల్లిగా సాక్షాత్కరించి స్త్రీలోనూ పురుషునిలాంటి పౌరుషాన్ని - పరాక్రమాన్ని చూపించాడు. ఐహిక జీవితంలో స్త్రీ - పురుషులకు సమాన ప్రతిపత్తిని ప్రతిపాదించడమే గాక, ఆధ్యాత్మికోపలబ్ధికి సహితం మధురభావ భరితమైన దాంపత్య బాంధవ్యాన్నే ప్రతిమగా గైకొన్నాడు. జీవుని ఆవేదనను విరక్తి ద్వారాగాక - అనురక్తి మార్గాన ఆహ్లాదంతో వ్యక్తం చేసుకొని ఆత్మలోనే పరమాత్మానుభూతిని పొందిన వైష్ణవ భక్తుడు. భగవద్భక్తిలో స్వాత్మను సాక్షీభూతం చేసుకొని స్వాత్మకు సమ అస్తిత్వం క్రియం చేశాడు. ఇంకా వాస్తవిక ఆదర్శాల సమ్మేళనంతో ఆత్మలో శీల—సౌమ్య గుణాల్ని ప్రవేశ పెట్టి, ఆత్మను రసానందంతో మునిగి తేలుతున్న 'రాధ'గా అభివర్ణించి పరమాత్మ కొరక సహగామిగా - స్త్రీ పాత్రగా సమర్పించు కొన్నాడు. బాహ్యాడంబరాలకు దూరంగా సాత్విక వైష్ణవ ప్రేమ పంథాలో దైవోపలబ్ధిని సిద్ధించుకున్నాడు. ఈ ఆధ్యాత్మికతను సంపూర్ణమైన అంతర్ దృష్టిలోనే పుష్టి చేసుకొని ఈ భౌతిక జీవితంలోనే కర్మ - జ్ఞాన - ప్రేమ మార్గాలద్వారా అనంత తత్వాన్ని పరిగ్రహించగలిగాడు.

రవీంద్రుడు బాల్యమునుండి భావుకుడు. ఎప్పుడూ ఏదో ధ్యాన నిమగ్నుడై దివ్యానుభూతిని పొందేవాడు. నాలుగు గోడలమధ్య పెరిగే స్కూలు జీవితం ఆయనకు నచ్చేదికాదు. ప్రకృతి దృశ్యాలు చూడాలని, కావ్యాలు

ఈదాలనీ, కొండలు ఎక్కాలనీ, పల్లెలు తిరగాలనీ, పని వాళ్ళతో కలసిముచ్చటించాలనీ, వుండేది. పల్లెజీవితమన్నా పల్లె పదాలన్నా మహాప్రీతి. పల్లెపదాలు పదేపదే పాడించుకునేవాడు ఆయనకు ఉల్లాస కేలిగా వుండేది. తనొక దూరప్రయాణికుడుగా భావించి నభఃప్రాంగణంలో స్వేచ్ఛా విహంగంగా విహరించాలని ఉండేది. చివరకు జీవితాంతం వరకు ప్రపంచమంతటా స్వేచ్ఛా జీవిగా పర్యటించాడు. ఒక్క దక్షిణఆఫ్రికా మాత్రం అక్కడున్న జాతిభేదాన్ని, రంగు భేదాన్ని అసహ్యించుకుని మహాసక్షోపంతో దక్షిణ ఆఫ్రికా వెళ్ళడం మానుకున్నాడు.

రవీంద్రుడు మిస్టిల్ యిన్‌సైట్‌వున్న మహాకవి గనుక సదా ప్రకృతితో తదాత్మ్యం పొందేవాడు. ఆయన కవిత్వం లోని ప్రకృతి వర్ణనలు ఒక సంశ్లిష్ట యోజనను ప్రవేశపెట్టాయి భావకవులందరకూ ప్రకృతి అధిష్ఠాత్రి లాంటిది. భావకవులు ప్రకృతి సౌందర్యానికి ముగ్ధులై ప్రకృతివడిలో విహరించారు. రవీంద్రుని ప్రకృతిప్రేమే ఆయన్ని శాంతి నికేతన స్థాపనకు పురికొల్పింది. ఆయనకు ప్రకృతి స్వయం సంపూర్ణమయిన సౌందర్యరాశి ఇష్ట దైవాన్ని చూపించే యారోమార్కు. పరబ్రహ్మయొక్క ప్రతిరూపంకూడా అదే నట. ప్రకృతి పరమాత్మయొక్క జ్యోతిలా లోకంలో ప్రకాశిస్తున్నదట

రవీంద్రుడు ప్రకృతినిమనోభూమిగా చేసుకుని భావ కుసుమాల్ని పూయించారు. ప్రకృతే ఆయన భావకవిత్వా నికొక ఖండకావ్య ధోరణిని 'గీతాంజలి'ని ప్రసాదించింది.

ఆయన గీతాంజలి భావకవిత్వానికి భగవద్గీత, టి. యస్. ఇలియట్ మాదిరిగా రవీంద్రుడు ఈశ్వరవిహీన ప్రపంచంలో ఆక్రందన చేశారు.

ప్రకృతి ఆయనకు చైతన్య స్వరూపాన్నే ప్రసాదించింది. ప్రకృతి చైతన్యంతో మానవచైతన్యం జోడించి జీవితాన్ని ఆధ్యాత్మికోన్ముఖం చేశాడు. ప్రకృతి చైతన్యం సహాయంతోనే కవిత్వాన్ని ఆధ్యాత్మికోన్ముఖం చెయ్యగలిగాడట. ప్రకృతిరూపంలో సదా తన్నెవరో పిలుస్తున్నట్లుగా మౌననిమంత్రణం వినేవాడు. రవీంద్రుడు అధ్యాత్మిక వాది, గాయకుడు, కవి అనడానికి ప్రకృతి ప్రేరేపణయే వెనుక నుండి పుష్ నిచ్చిందట. జీవితంలోని శాంతస్వభావానికి, కావ్యంలోని కోమల కల్పనలకు సైతం ప్రకృతే దోహద మిచ్చిందట. కవి - ప్రకృతికి వున్న అవినాభావ సంబంధం యిది.

ప్రకృతి అనురాగమే ఆయన జీవితాన్ని కావ్యంగా మార్చింది. ఆకు ఆకునా, పువ్వు పువ్వునా సంపూర్ణచైతన్య సత్తాను దర్శించి, సహజ ఉల్లాసం పొందాడు. 'జాల్ పడే పాతానడె' అనే వాక్యం చిన్ననాడు ఎలిమెంటరీ స్కూలులో చదివాడట టపటపా వర్షం కురుస్తూ వుంది. ఆకులు ఉల్లాసంతో నాట్యం చేస్తున్నాయి - వాక్యార్థం యిది. యీ వాక్యార్థమే ఆయన్ని ప్రకృతి ప్రేమకు దారితీయించిందట. బాల్యంలోనే ఆయన్ని శిలాయి దహాలో ప్రవహించే పద్మా నది మరింతగా ఆహ్వానించింది. పద్మానదిలో పడవలు నడుపుతూ వుండేవాడు. పద్మానది దృశ్యాల్ని అనేక కథల్లో

కవిత్వాల్లో అక్షరబద్ధం చేశాడు. ఆత్మాభివ్యక్తీకరణకోసం చిన్ననాటినుండి తహతహలాడేవాడు. శిలాయిదహ ప్రకృతి దృశ్యాన్ని చకోర్‌వాలీ కథలోనూ, క్షణిక - కల్పన, కవిత్వాల్లోనూ, పునఃస్మరించారు. ప్రకృతిప్రేమ - తపోవన ప్రేమలు ఆయన్ని కాళిదాసు రఘువంశం, శాకుంతల రచనల్ని పదేపదే చదివించాయట.

ప్రకృతిలో తా దర్శించిన ఆధ్యాత్మిక సౌందర్యాన్వేషణం ఆయన కవితల్లో ఆధ్యాత్మిక ఆవేదనగా మారింది. కావ్యంలోని ప్రకృతి వర్ణనలు ఆధ్యాత్మిక పరిభాషికం ప్రతీకలుగా నిలిచిపోయాయి. ప్రకృతిలోని మూగతనం ఆయన స్వభావంలో మూకవ్యధను ప్రవేశపెట్టింది. అదే మూకవ్యథ రచనల్లోనూ వ్యక్తమయింది. ఆయన ముఖాకృతిసైతం సదా మూకవ్యధతో పుట్టిపడేది. ఆయన హృదయం, సముద్రంలా వుండి వుండి ఉప్పొంగేది. మరొకప్పుడు ఆకాశంలా మౌనం వహించేది. ఆయన ప్రకృతి స్వభావం ఆయన అగణ్యకజీవితం ఈ వైజ్ఞానికయుగంలో ఎందర్ని ఆకర్షించలేదు? ప్రపంచం నలు దిశలనుండి మహా విజ్ఞులెందరో శాంతినికేతనానికి ప్రయాణం చేశారు ఎండ్రూస్ రవీంద్రుని తపోవన జీవితానికి వంశీభూతుడయిన విదేశీయుడు. అది ప్రపంచానికే యాత్రాస్థలం. అరవిందాశ్రమంసైతం విదేశీయులెందర్ని ఆకర్షించలేదు? 'మాత' అరవిందుని ఆశ్రమజీవితానికి, యోగాభ్యాసానికి అకర్షించబడి ఆశ్రమవాసిగా స్థిరపడిపోయింది. స్వదేశం ఫ్రాన్సును శాశ్వతంగా త్యజించింది. తపోవనాలు యే

ఒక్క వ్యక్తికి—జాతికి—దేశానికి చెందిన వ్యష్టిసంపదలు కాక సమస్త మానవజాతికీ చెందిన సమష్టి సంపదలుగా నాడూ, నేడూ ఒకే అర్థంతో నిలిచిపోయేయి.

తపోవనవాసులంతా మృత్యుంజయులు— మృత్యు ప్రియులు. మృత్యువులోను జీవనసార్థకతను చూపెట్టారు. మృత్యువు ప్రభు పంపిన దూతికట. రవీంద్రుడు మృత్యువునుగురించి యిలా వ్రాసేడు 'మృత్యువంటే ప్రభు పంపిన పిలుపు. జీవన్మరణాలు వ్యాపారం లాంటివి. అవి తప్పనివి. మృత్యువును ప్రేమించటం ద్వారా శాశ్వత ఆనందం పొందుతావు. అది జీవనవేగాన్ని పెంచుతుంది. కనుక, దానికి సుస్వాగతం చెప్పు. మృత్యువులో అమరత్వం వుంది. అంటూ జీవన్మరణాలో దార్శనికఅర్థం చూపెట్టాడు. మృత్యువులోనూ, జీవసార్థకతను అవలోకించి సదా క్రియాశీలుడై, జీవితంలో స్థిరంగా నడిచాడు.

# ఉపనిషత్ కవి

సైన్సు విలుబడిలో వున్న యుగం యిది. మంచి చెడులమధ్య సైన్సుకు యిది అగ్నిపరీక్షాసమయం. రోదసీ యాత్రలో ఒకవైపు పోటీలు జరుగుతున్నాయి. ఈ రోదసీ పోటీలో ఒకనాడు రష్యాది ముందడుగైతే మరొకనాడు అమెరికాది పైచెయ్యి. ఈ క్షణానికి రష్యాదే పైచెయ్యి.

అన్నిరకాల జీవరాసులమీద సంపూర్ణ ప్రాతినిధ్యం వహించాలనే కాంక్ష మానవునిలో నానాటికి పెరిగిపోతున్నది. కొన్ని యుగాల్లో సాధించవలసిన పరిణామాన్ని తన మేధాశక్తితో కొన్ని సంవత్సరాల్లోనే సాధించగలుగుతున్నాడు. అధికాధికంగా ప్రకృతిని జయించి ఆర్థికాభివృద్ధి పొందుతూ తక్కువ కష్టంతో ఎక్కువ సౌఖ్యం చేకూర్చుకొంటున్నాడు. నిత్యం పెరిగిపోతున్న జనాభాకు సైన్సు రకరకాల ఉద్యోగాలు చూపుతున్నాడు. ప్లాస్టిక్ లాంటి నూతన పదార్థంతో అనేక లఘు–భారీ పరిశ్రమలు స్థాపించి ఎందరికో పనికల్పించి జీవనోపాధి కలుగజేస్తున్నాడు. ఈ

విధంగా మానవుడు స్వశక్తి - సత్సంకల్పంతో లౌకికాభి వృద్ధిని ఎంతగానో సాధించాడు. అయినా ఒక్క లౌకికాభి వృద్ధే సర్వం కాదుగదా? మానవుడు ఒక్క అన్నమయుడే కాదు - ఆత్మమయుడు - మనోమయుడు కూడాను.

సైన్సు లౌకిక జీవనానికి ఎంతగా తోడ్పడినా, మానవునిలో యితరంగా వున్న మానవత్వం విషయంలో కామ్‌గా వుండిపోయింది. ఆత్మీయత - మానవతల్ని మేల్కొల్పి తద్వారా పరస్పర ప్రేమ-సౌభ్రాతృత్వాలని పెంపొందించ లేకపోయింది. జీవితంలోని సుఖదుఃఖాలు, ఆశ నిరాశలు, భ్రమ, సంభ్రమల నన్వేషించి ప్రేమానుభూతులు - సానుభూతులు మొలకలెత్తే అంతర్గతులను వెలికి తీయలేక పోయింది. ఈ పని తత్త్వవేత్త-సాహిత్యవేత్తలు మాత్రమే చెయ్యగలుగుతారనే విషయం సైన్సే రుజువు చేసింది.

ఈ సైన్సులో నిన్న మొన్నటివరకు తత్త్వవేత్తలు, సాహిత్యవేత్తలు ఉపేక్షింపబడుతూనే వచ్చారు. పూర్వ కాలంలో ఒకప్పుడు కవులు-తత్త్వవేత్తలే సాంఘిక రాజకీయరంగాల్లో స్వపరభేదం లేకుండా సమాజాన్ని గురించి ఆలోచించి రాజ్యాలు నడిపిన రోజులు సైతం చరిత్రలో ప్రకాశిస్తున్నాయి. అధ్యాత్మం ప్రధానంగా లాజిక్-లాంగ్వేజ్ కతీతంగా ఇంటలెక్ట్యువల్ కంటే ఇంట్యూషన్ మూలంగా ప్రేమ జ్ఞానాల పరికరాలతో సమాజాన్ని తీర్చిదిద్దిన సువర్ణ యుగం అది. ఉపనిషత్తులనాటి సమాజం ఇలాంటిదే.

ఉపనిషత్తులనాటి తాత్వికులు కేవలం లోకాన్ని అబ్జర్వు చెయ్యడానికి వచ్చిన పైదాగరస్‌లు కాదు. ఆనాటి తత్వవేత్తలు ప్రాపంచిక - పారమార్థిక జీవితాలను మిళితం చేసి రెంటిని పూర్వాపర సంబంధాలుగా గడిపారు. పైగా ప్రాపంచిక జీవితానుభవం తరువాతనే పారమార్థిక జీవితం సుకరం అనే విశ్వాసంతో భౌతిక జీవన వికాసాన్ని ప్రోత్సహించి తద్వారా ఆత్మోన్నతి ప్రధానమైన పారమార్థిక జీవితం గడిపారు. తద్వారా యింద్రియ జన్య జ్ఞానం ఆత్మజ్ఞానానికి అవరోధం కాదనే సమన్వయ సిద్ధాంతాన్ని లోకానికందించారు. 'ఆత్మవస్తు కామాయ సర్వం ప్రియం భవతి' అన్న ఉపనిషత్ వాక్యం యింద్రియజన్య జ్ఞానం ద్వారా ఆత్మోపలబ్ధికి పూర్ణత్వం సిద్ధిస్తుందనే సత్యాం రుజువు చేసింది. వేదకాలంనాటి ఋషిజీవితంకంటె ఉపనిషత్ కాలం నాటి ఋషిజీవన విధానం అభ్యుదయకరమని చెప్పొచ్చు. 'దుఃఖమేవ సర్వం వివేకినః' అని వేదకాలపు ఋషులు లౌకిక జీవితాన్ని నృజించి వైరాగ్యం వుపదేశించినా, ఉపనిషత్ కారులు దుఃఖమయంఅయిన ఈ భౌతిక జీవితాన్ని నృజించక దుఃఖనివృత్తికోసం పారమార్థిక జీవితాన్నొక సాధనం చేసుకొన్నారు. ఇంకా జీవితమందలి యదార్థాన్ని అవగాహన చేసుకొనడానికి భౌతిక జీవితాన్ని స్వయంసంపూర్ణమైన ఒక సైన్సుగా వాడుకున్నారు

ఉపనిషత్తుల ప్రకారం ఆత్మకే ప్రధాన స్థానం. ఆత్మ ప్రేరణవల్లనే శరీరం అనుసంచారణం, ఉజ్జ్వగతలు కలిగి

ఉంటుంది. ఇంకా అంతరంగిక అగ్నిహోత్రం, యమ నియమాది శక్తులూ ఆత్మసంచారితాలే మానవుడు కూర్చున్నా-నుంచున్నా, కర్మచేస్తున్నా - కనికరిస్తున్నా అంతా ఆత్మ ప్రేరితమే. 'వుయ్ వాక్ బై ఫెయిత్ నాట్ బై సైట్' అన్న బైబుల్ వాక్యం ఈ ఉపనిషత్తుల సత్యాన్నే వ్యక్తపరుస్తున్నది.

జీవితంలో ఆత్మకున్న ప్రధాన స్థానాన్ని కేవలం ఉపనిషత్ కారులే కాక నేటి విజ్ఞానశాస్త్రజ్ఞులు సైతం దృఢంగా వ్యక్తపరిచారు. డబ్ల్యు. బి. కానన్ తన 'విజ్డమ్ ఆఫ్ ది బాడీ' లో శారీరక చేష్టలన్నీ ఆత్మప్రేరితాలేనని రుజువుచేశారు. ఇంకా ఆయనకు కలిగిన మరొక సందేహం యిది - సైన్సుద్వారా యింద్రియజన్య జ్ఞానాన్ని పెంచుకుంటున్నప్పుడు అదే సైన్సుద్వారా సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మజ్ఞానాన్ని ఎందుకు పెంచుకోగూడదు? నిత్యజీవితంలో అతీంద్రియ జీవితం యెందుకు సాధ్యంకాదు? ఎక్స్ట్రా సెన్సరీ పెర్సెప్షన్ ద్వారా అతీంద్రియ జీవితం సాధ్యమనే ఒక గట్టి నమ్మకానికి వచ్చాడు. తన నమ్మకాన్ని ఈవిధంగా బలపర్చాడు. పూర్వంకంటె యీనాడు మైక్రోఫోను ద్వారా సూక్ష్మాతి సూక్ష్మ పదార్థాన్ని, అణుకణాన్ని— మరోవైపు అనంతదూరాన్ని చూడగలుగుతున్నాం. టెలివిజన్ అనంతదూరాన్ని కళ్ళకు కట్టినట్లు చూపుతున్నది. ఈ విధమైన సైన్సు సాధనాలద్వారా మన దృష్టిని పెంచుకున్నాం. ఇదేవిధంగా ఎక్స్ట్రా సెన్సరీ పెర్సెప్షన్ ద్వారా అంతీంద్రియ జ్ఞానం (ఆత్మ - పరమాత్మ జ్ఞానం) సంభవం

కాగలదంటూ సైన్సుద్వారా ఆత్మ విద్యను అభ్యసించ డానికికృషిచేశారు. బెర్ట్రాన్డ్ రసెల్ విశ్వశాంతికి సైన్సును యీవిధంగా బలపర్చాడు. సైన్సు ద్వారా ప్రకృతి మీాద సాధించిన నూతన విజయాల ఆధారంతో లోకంలో మున్నె న్నడూ సాధించని శాంతి భద్రతలను మానవుడు స్థాపించు కోవచ్చు.

ఉపనిషత్ కారులు బాహ్య పరికరాలతో నిమిత్తం లేకుండానే ఆత్మజ్ఞానంతో పరమాత్మను దర్శించగల్గారు. ఇంకా ఆత్మశక్తుల్ని అపారంగా పెంచారు. ఋజువుచేశారు. బాహ్యేంద్రియాల ద్వారాఅనుభవంలోకిరాని ఎన్నోశక్తులు సుషుప్తావస్థలో నున్నట్లుగా కనిపెట్టారు. ఒక్క మనస్సే తన స్వరూప సంస్కారం చెబుతుందనే సత్యం గ్రహించారు. ఆత్మనే నమ్మి ఆత్మనే అనుసరించినా ఆత్మ వికాసానికి శరీ రాన్ని అడ్డుగా భావించలేదు. నేటి అరవింద, రవీంద్రులు సైతం ఉపనిషత్ కారుల వలె తమ ఆత్మ వికాసానికి శరీరాన్ని అండగా చేసుకుని జీవన్ముక్తులైన వారే. 'దివ్య శరీరంలో దివ్య జీవితం' అని అరవిందుడు యీ శరీరం సహాయం తోనే ఆత్మ సత్యం—ఆత్మ సౌందర్యం, ఆత్మ జ్ఞానాన్ని వెలికి తీశాడు. సైన్సు ద్వారా ప్రకృతిని జయించినట్లుగా ఆత్మశక్తిద్వారా ప్రకృతిమీాద ఆధిపత్యం చూపించవచ్చునని కొన్ని నిదర్శనలు సైతం చూపించాడు. అరవిందుడు యీ భౌతిక మానవుణ్ణి కేంద్రం చేసుకుని అతీంద్రియ జ్ఞానం సాధించాడు. ఆత్మ సిద్ధి పొందాడు. సైన్సు ద్వారా మేధావి సైంటిస్టు ప్రకృతి మీాద ఘన విజయం సాధించినట్లు అరవిం

దుడు ఆత్మశక్తితో సైనిస్టుకు మించిన అతిమానసలోకాన్ని దర్శించగలగడం యీ సైన్సు యుగంలో గొప్ప ఆధ్యాత్మిక విజయం సాధించాడని గర్వంగా చెప్పుకోవచ్చు అరవిందుడు ఆత్మజ్ఞానం ఏ పరమాణు శక్తికీ తీసిపోదు. అరవిందునితో ప్రపంచంలో నూతన ఆధ్యాత్మిక యుగం ఒకటి ఆరంభమైంది. లోకం మొత్తంగా ఆయన వైపుకు ఆశ్చర్యంగా చూసింది. సైనిస్టు సైతం ఆశ్చర్యపడ్డాడు. అరవిందుని ఆత్మ వలెనే దేహం కూడా జ్యోతిపుంజమై ప్రకాశించింది. యీ జ్యోతిర్మయ దేహాన్నంటి పెట్టుకునే జ్ఞానేంద్రియాల కతీతమైన శాశ్వత సత్యాన్నొకటి చూడగలిగిన స్థితప్రజ్ఞుడు అయ్యాడు. ఇంకో అడుగు ముందుకు వేసి తన వ్యష్టికోకాక సమష్టి విముక్తికోసం తాను అవిరామంగా ఆలోచించాడు. అధ్యాత్మం వ్యష్టిగా కాక సమిష్టిగా రూపొందుతుందనే గట్టి నమ్మకాన్ని వ్యక్తపరచాడు.

రవీంద్రుడు అధ్యాత్మంలోని ఆడంబరాన్ని సాహిత్య స్వరంలో క్రింది విధంగా వ్యతిరేకించాడు—రథ యాత్రి సాగింది. భక్త బృందం గుంపులు గుంపులుగా ఎదురేగి నమస్కరిస్తున్నారు. కొందరు సాష్టాంగ నమస్కారం చేస్తున్నారు. దారి అనుకుంటూ వుంది; నేనే దేవతను. నాకే భక్తులు నమస్కరిస్తున్నారు. రథం నేనే. దేవతను, నాకే నమస్కరిస్తున్నారు. రథంలోని విగ్రహం... నేనే దేవతను. నాకే నమస్కరిస్తున్నారు. యీ ముగ్గుర్ని చూచి అంతర్యామి ఫక్కున నవ్వాడు.

రవీంద్రుని ఆధ్యాత్మిక చైతన్యం పిత్రార్జితం. రవీంద్రుని తండ్రి ఉపనిషత్ పాఠకుడు. ఆత్మజ్ఞానం నేర్పిన తండ్రిని ప్రశంసిస్తూ 'మై ఫాదర్ వజ్ ఎ లివింగ్ కామెంటరీ ఆన్ ది ఉపనిషత్స్' అన్నాడు. పూజా విధానం, శృతులు స్మృతుల నుండి తానేమీ నేర్చుకోలేదట. చివరకు విశ్వ విద్యాలయాలు తనకు నేర్పిన ఆత్మజ్ఞానం శూన్యమట. వాదలకు వందలు గ్రంథాలు చదివి గ్రహించింది ఏమీలేదుట. ఈశ—తైత్తిరీయ—కఠోపనిషత్తులు, వంగ దేశపు బావుల్ జాతి వీధి గాయకులు తనకు గురువులట. బావుల్‌తో పాటలు—పదాలు మరీమరీ పాడించుకొని వాళ్ళ పాటల్లోని విశ్వప్రేమ, అధ్యాత్మం అపారంగా గ్రహించాడు. వాళ్ళ సాంగత్యం కూడా ఆయన అధ్యాత్మానికి గొప్ప నాదమిచ్చిందట. ('సాధన' 'గీతాంజలి' గీతాలు బావుల్ గాయకుడుగా పాడిన గీతాలే) తానూ ఓ సాధువుగా అధ్యాత్మానందంలో మునిగి తేలుతూ మధుర స్వరంలో అమృత గానం చేశాడు. గీతాంజలిలో రవీంద్రుడొక విముక్తాత్మ. విముక్తాత్మకే దివ్యత్వం సిద్ధిస్తుంది. విముక్తి సిద్ధించినప్పుడే ఆత్మ పరమాత్మతో బాంధవ్యం పెంచుకోగలుగుతుంది. అప్పుడే ఆత్మ సాక్షాత్కారం సంభవమవుతుంది. పరిణామం అతీతానందం—బ్లిస్ అనే చిరంతన ఆనందం. యీ ఆనందం ఆత్మోపలబ్ధి ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. అందుకై చైతన్యం నిండుగా సాయ పడాలి. అప్పుడే ఆత్మ పరమాత్మ స్థితికి రాగలుగుతుంది. ఆత్మ-పరమాత్మల బాంధవ్య రహస్యాన్నే గీతాంజలిలో పాడుకున్నాడు. ఒక మహాభక్తుని భక్తిగీతాలే

గీతాంజలి—మిస్టిక్ ఇన్ సైట్‌తో ప్రేరేపింపబడి బ్రహ్మైకాత్మ్యం కోసం పడిన ఆరాటం గీతాంజలి. ఆవేదనానంతరం ప్రాప్తించిన పరమానందం గీతాంజలి తానొక భక్తుడై తన్మయత్వం పొందుతున్నాడు—

అపరిమేయు జేసి నన్ను
ఆనందించినావు ప్రభూ!
రిక్తమొనర్చి మరల మరల
నింపుదు వీ జలపాత్రిక
కొంగ్రొత్త జీవనమ్ము గోసి,
చిన్నారి మురళి నీసి దిని, సు
తుంగ గిరుల వనుల గ్రిప్పి
ఏవేళకు మాయని తీయని
సంగేయ స్వరము నింపినావు

... .... ...

గానమ్ము చేయమంటివప్పుడు
నా హృది గరువాన పొంగె
నీ మోమువంక కన్ను వంచి
చూచినాను కన్నీరు లొలికి

ఆత్మ దర్శన కోసం చూపిన ఆవేదన—

కాని నాపార్థివాకార కఠిన మమత
అంతకంతకు దరిలాగి యనునయించు
వీడిపోవుదునని దాని వెరపదేల?
దినము దినములు డొల్లె ప్రతీచిలోకి
నీవ వొక్కెడ వొక వింతనెమ్మికాడ

నాత్మ దర్శనం బీయవో ఆత్మసఖుడ !
పరమాత్మలో లయించి పోగలంతటి చైతన్యం ప్రసాదించ మని ప్రార్థిస్తున్నాడు—

నా బంధన పాశము బహుపలుచగ
నీ ప్రేమను విడనాడకుండు నంతగ
నా జీవన సర్గలలో
నీ పర్యవసానమే ఉండునటుల
అంతయె నాకిమ్ము ప్రభో !

రవీంద్రుని హృదయాధిష్ఠాత ఆవలి ఒడ్డునుండి పిలుస్తున్న ఓ పరదేశస్థుడు. మధుర మురళి మోగిస్తూ పిలుస్తున్నాడు—

ప్రొద్దుగుంకె సినరశ్ములు
అరుణములై జారెపిరుల
జలభాండము నింప నేటి
సికతలపై కాలూనితి

*  *  *

ఎవరోహో ! పరదేశస్థుడు
ఆ పడవమీద ఏటినడుమ
మురళివంచి మోవిచివర
నను పిలిచిన యటులూదుకొనుచు
ప్రొద్దుగుంక, నినరశ్ములు
అరుణములై జారు వేళ.

(గీతాంజలి,దుర్గానంద్ అనువాదం నుంచి)

రవీంద్రుడు వైష్ణవభక్తుడు. ఆయనది భాగవత ప్రేమ. వైష్ణవకవులు అధ్యాత్మంలో ఆనందవాదులు. భాగవత ప్రేమ

రాధాకృష్ణుల ప్రేమ—అది అపరిమేయం—అలౌకికం—ఆత్మీయం భాగవత ప్రేమలో గోపికలకు కృష్ణుని రూపం—భావం రెండూ ఆనందం ప్రసాదిస్తాయి. కృష్ణ ప్రేమ భోగలాలసాన్ని ప్రేరేపించే ఉమర్ ఖయ్యాం లాంటిదికాదు. అది జానపద ప్రేమ—పల్లెసీమ. ఎంకినాయుడు బావల అలౌకిక ప్రేమ—అధ్యాత్మ ప్రేమ. ఆ ప్రేమలో ఏకత్వం వుంది. రవీంద్రుడు ఈ అనంతప్రేమ ద్వారా గీతాంజలిలో అనంత తత్వాన్ని చూడగలిగాడు. జయదేవ్ - చండీదాసుల ప్రేమ యిలాంటి భాగవత ప్రేమే. కబీరు సైతం ఆత్మ—పరమాత్మల బాంధవ్యాన్ని దంపతుల ప్రేమ సంబంధంగా వర్ణించాడు. వంగదేశపు బావుల్ సాధువుల భక్తిగీతాలు అధ్యాత్మంలోని అనంతప్రేమనే వ్యక్తంచేశాయి. అధ్యాత్మంలో ఆత్మ పరమాత్మలు సమభాగులు. యిద్దరూ ఆనందాన్ని సమానంగా అనుభవిస్తారు. ఒకరి అస్తిత్వాన్ని రెండవవారిలో చూస్తారు. ఒకరి నింకొకరిలో కోల్పోతారు. అదే ఆత్మసమర్పణ—అంతటితో అహం సమాప్తమవుతుంది. అదే పరిమిత అపరిమిత ఆత్మల అనంత ఐక్యం—అమృత తత్వం అంతస్సంబంధం. పరమాత్మలోని అమృత తత్వాన్ని సాహిత్యంద్వారా రవీంద్రుడు మానవతోన్ముఖం చేశాడు. గీతాంజలి నొక మనోభూమిగా—భావనభూమిగా—సృష్టించి పరమాత్మతో తానందు విహరించాడు. రాధగా అలిగాడు——

"ఆమినహోలె భువనేశ్వర,
తోమార్ ప్రేమహోతోయే మిఛే"

ఓ భువనేశ్వరా ! నేను లేకపోతే నీప్రేమ వ్యర్థమైపో తుంది, అంటాడు తన అధిష్ఠాతతో.

రవీంద్రుని అధ్యాత్మానికి అంతరాత్మ— అంతర్ మానవుడే కేంద్ర బిందువు. అంతరాత్మను మనేర్ మానుష్ (మేన్ ఆఫ్ ది హార్ట్) అనే పేరుతో సంబోధించాడు. ఈ మనేర్‌మానుష్‌నే సర్వత్రా గౌరవించి పాడుకున్నాడు. మనేర్‌మానుష్ నివాసస్థానం హృదయం. రవీంద్రునికి హృదయమే ఒక తీర్థస్థానం. అదే ఒక దేవళం —మసీదు —చర్చి హృదయపీఠం నుంచే మహాత్ములంతా సత్యసాక్షాత్కారం గావించారు— బ్రహ్మతాదాత్మ్యం పొందారు. రవీంద్రుడూ ఆత్మ సాక్షాత్కారం పొందిన ఒక మహాత్ముడే. మిస్టిక్ పొయిట్సు—తత్వవేత్తలైన కవులంతా కబీరు—వేమన—రవీంద్ర—అరవిందుడు సర్వత్రా ఒకే తాదాత్మ్యం పొందారు. "'ఏకో దేవః సర్వభూతేషు గూఢం'—ఆత్మవత్ సర్వభూతేషు"లు వాళ్ళ సిద్ధాంతం అయినప్పుడు విశ్వమానవుణ్ణి—విశ్వమానవతను అక్షరం అక్షరంలో వ్యక్తంచెయ్యడంలో ఆశ్చర్యంలేదు. ఈ సిద్ధాంతం మీదనే రవీంద్రుడు విశ్వమానవ మతాన్ని ది రిలిజియస్ ఆఫ్ మేన్ సృష్టించాడు.

రవీంద్రుడు సృష్టించిన విశ్వమానవమతం ఈ వైజ్ఞానిక యుగంలో ఒక నూతన చైతన్యంగా రూపొందింది.

పూర్వ పశ్చిమ సాహిత్య సంస్కృతులకు జీవంపోసింది. జీవితంలోని శాశ్వత అమూల్యాలకు మెరుగులు పెట్టింది. కథ వ్రాసినా—కవిత్వము వ్రాసినా ఒకే చైతన్యం విశ్వ మానవ చైతన్యం—ఒకే ఆత్మీయత— . అపరిగ్రహణం ముందు పెట్టాడు. సర్వత్రా స్వార్థం—అధికారవాంఛ లేని ఉదాత్తమానవుణ్ణి చిత్రించాడు. ఆధ్యాత్మిక చింతనలేని జీవితం అపూర్ణమని భౌతిక ఆధ్యాత్మిక జీవితాలను జోడించి చూడగల విశాలదృష్టి—దూరదృష్టిని రచనల్లో రూపొందించాడు తన మట్టుకేకాక భవిష్యత్తులో ఆధ్యాత్మికశక్తిని పెంచుకునే జాతికి—దేశానికే పరిపూర్ణ జీవితమని దేశ దేశాల్ని హెచ్చరించాడు. స్వపరభేదం విస్మరించడంతో మనసుకు శాశ్వతి చైతన్యం లభిస్తుందని—రెండు విరుద్ధ శక్తుల సమన్వయంతోనే శాశ్వతి ఆనందం సంభవమని దేశ దేశాల్ని హెచ్చరించాడు. ఒకరొకర్ని జాయింట్ చేసేది ఆధ్యాత్మ్యం ఒక్కటేనని 'నీవు—నేను' అని పిలిచేచోట 'మనం,' అని పిలిచేరోజు వస్తుందంటూ ఆధ్యాత్మిక భవిష్యత్తులో మహావిశ్వాసం వెల్లడించాడు. ఇంకా కత్తుల్లానూ మానవత్వం పుట్టిపడే రోజుల్ని కాంక్షించాడు రచయితలో నున్న సహజ సానుభూతి, అటు కర్మజగత్తుకు అతీతంగా వుంటున్న తత్వవేత్త, యిటు మారణ అస్త్రాలు తయారు చేస్తున్న సైంటిస్టుల్లో వెల్లివిరియాలని యిద్దరికి హెచ్చరికలు చేశాడు.

ఏది వ్రాసినా మానవత్వం—సద్భావన దయలు సంగ్రంచి యిచ్చాడు. ఇదే సమాజంలో ఏకీకరణకు సాధన

మట మిస్టిక్ ఇన్ సైట్ శాంతవరకు కవిలో సమభావం రావాలదట. సర్వసంగపరిత్యాగం చేసినవారిలోనే దయా దాక్షిణ్యాలు అపరిమితమట. జాలిగుండె కలవారే మును లట—ఇంత వుదారస్వభావం వుండబట్టే రవీంద్రుడు సర్వ స్వం శాంతినికేతనానికి సమర్పించగలిగిన ముని కాగలి గాడు. శాంతినికేతన స్థాపనోద్దేశ్యాన్ని యిలా వ్యక్తపర చాడు :

This instution is in response to God's will, but not mine. The students while studying here may feel God's consciousness.

ఈ సైన్సుయుగంలో ఆత్మజ్ఞానం శూన్యంగావున్న విద్యార్థుల్లో ఆత్మజ్ఞానం బోధించేనిమిత్తం శాంతినికేతనం స్థాపించాడు. నేటి విశ్వవిద్యాలయాలు విద్యార్థుల్ని స్టీమ్ రోలర్సుగా తయారుచేస్తున్నాయని విమర్శించాడు. రొటీన్-స్టాండర్డైజేషన్లు విద్యార్థులకు శతృవులట. విద్యావిధా నంలో సినిమాలు—రేడియోలు - టెలివిజన్లు సాధనాలుగా పనిచేస్తున్నా విద్యార్థుల్లో మానసికాభివృద్ధి జరుగలేదని - చదవటం చదివించటం ఫ్రీగావుండాలని, ప్రేమతో పాఠాలు బోధించాలని భక్తితో అన్నాడు. ఇదే రవీంద్రుని విద్యా విధానం.

# జీవిత సమన్వయ వాది

ఇది 'సైన్సు' ఇది 'ఆధ్యాత్మం' అని ప్రత్యేకంగా విడమర్చి వ్యాఖ్యానించ వీలుపడని పరిస్థితులు పరిణామాలు నేటి సైంటిస్టులను, తత్వవేత్తను ఆలోచనలో పెట్టి మరీ దూరం తీసుకుపోతున్నాయి. 'సృష్టి అంతా పరమాణు జనితం— గతిమయం.' అది సదా ప్రశంసితమని సైంటిస్టులు తేల్చి పెట్టిన విషయమే. సృష్టిలో మూమెంటు (గతి) లేనట్లయితే లోక మంతా చల్లబడి మంచుగడ్డయి కూర్చుండేదే నని, సృష్టికి పరమాణు శక్తియే మూలకారణమని ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ సైతం ప్రకటించినవారే. ప్రతి పరమాణువు ఎలక్ట్రాన్+ప్రోటాన్ పేర్లుగల నెగిటివ్+పాజిటివ్ విద్యుత్తు శక్తుల సమాఖ్య ద్వారా సంచాలితము. ఈ విద్యుత్తు శక్తులన్నీ తరంగ రూపాలు. ఈ విభిన్న పరమాణుశక్తుల సమ్మిశ్రణవల్లనే సమస్తవిశ్వం నిలబడివుంది. ఈ ప్రపంచంలో ప్రతినిమిషం సృష్టి సంహారాలు దాగుడుమూతలు ఆడుతూనే వుంటాయి. ఈమార్పంతా నెగిటివ్+పాజిటివ్ విద్యుత్ శక్తుల ద్వారానే జరుగుతూ వుంటుంది. పరమాణు శక్తిలో వచ్చే మార్పు పదార్థంలోనూ వస్తూ వుంటుంది. పాలు పెరుగుగా రూపొం

దడ మనేది ఇలాంటి మార్పే. ప్రకృతి 2X2 =4 లాంటి నియ మాలకు లొంగి నడచేది కాదు. ప్రకృతిలోని ప్రతి అణువు, రేణువులోనూ సూక్ష్మాతిసూక్ష్మంగా యీ విద్యుత్ కణాలు మూర్తీభవించి వున్నాయి. అనంత వస్తుతత్వాన్ని అన్వే షించి సైన్సు చెప్పిన కథ యిది.

సూక్ష్మరూపంలో సర్వవ్యాప్తమై వున్న ఈ విద్యుత్ శక్తినే వేదాంతులు సర్వవ్యాప్తమై వున్న బ్రహ్మగా వివ రించారు. అనంత వస్తుతత్వాన్ని అన్వేషిస్తూ వస్తున్న శాస్త్ర జ్ఞుడు—రెలిటివిటీ సిద్ధాంతంతోనూ, అనంత సత్యతత్వాన్ని శోధిస్తున్న తత్వవేత్త, భిన్నత్వంలో ఏకత్వం సిద్ధాంతం తోనూ అధ్యాత్మంలోని అద్వైతాన్ని బలపర్చారు. ప్లాక్+ ఐన్‌స్టీనుల రెలిటివిటీసిద్ధాంతం అధ్యాత్మంలోని అద్వై తాన్నే సమర్థించింది. సుప్రసిద్ధ దార్శనికుడు బర్గసా, ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు ఎడింగ్‌టన్ లిద్దరూ మానవ జీవితాన్ని గురించి ఆలోచిస్తూ ఆలోచిస్తూ ఒకే నిర్ణయానికి భిన్నత్వంలో ఏక త్వానికి వచ్చేశారు. కార్యకారణ సూత్రం (Law of Casua lity) సైన్సుకు మూలంగా పనిచేస్తున్నా, హేతువాద బుద్ధికి అంతుపట్టని ఏదో వైచిత్రిని జీవశక్తి అద్భుతంగా ఉపయో గించుకుంటూనే వుంది. జీవశక్తి తన కనుసన్నలలో మెలగ గల జీవకణాలను సమీకరించి ప్రతిఘటిస్తూనే వస్తున్నది. ఒకరకంగా యిది సైన్సులోని అద్వైతభావం ఈ అద్వైత భావమే సైన్టిస్టుని అధ్యాత్మం వైపుకు మలిపింది జీవశక్తి చేస్తున్న అద్భుత వైచిత్రిని గుర్తించిన రవీంద్రుడు సైన్సును గురించి యిలా వ్రాస్తున్నాడు : 'సైన్సు ఆత్మానుప్రాణి

తమే. అదికూడా ఆధ్యాత్మిక అన్వేషణ చేస్తున్నది. ప్రకృతి లోని జడత్వం ఆత్మ విరోధి కాదు. ప్రకృతిలో ఆధ్యాత్మిక చైతన్యం వుంది. ఉపనిషత్తులవాక్యం 'సర్వమ్ ఖల్విదం బ్రహ్మ' నుబట్టి ఈ లోకమంతా బ్రహ్మమయం ప్రకృతి బ్రహ్మ స్వరూపం. అది ఒక దివ్యసత్యాన్ని నిరూపిస్తూ వుంది.

మానవునిమీద మహా విశ్వాసం వున్న రవీంద్రుడు సైన్సు చెప్పే సత్యాన్ని అక్షరాలా అంగీకరించాడు డార్విన్ పరిణామవాదం—మానవుడు కోతినుండి వికసించాడన్న సిద్ధాంతానికిసైతంస్వాగతం యిచ్చిన రవీంద్రుడు ఎంత భౌతిక వాదో ఎంత అభ్యుదయవాదో వేరే చెప్పనక్కరలేదు మానవుని అస్తిత్వం సత్యమని అంగీకరించిన తర్వాత అతని చుట్టూవున్న ప్రపంచం—ఆ ప్రపంచంలో అతనికున్న బాంధవ్యం కూడా స్వీకరించాలని 'The religion of Man' గ్రంథంలో అడుగడుగునా వివరించాడు. ఒక వస్తువుకంటె వస్తువుకు,వస్తువుకు మధ్యగల సంబంధమే నిండు సత్యమట.

అధ్యాత్మం అంటే ఎక్కడో వంటరి ప్రదేశంలో తపోవనాల్లో వుంటుందని ఏకపక్ష విశ్వాసం గలవారు వున్నారు. లేక అధ్యాత్మవాది అంటే అసమర్థుడు,అశక్తుడు దరిద్రుడు అనే భావం కూడా ఒకప్రక్క సమాజంలో కొందరిలో వుంది. ఇంకా కొందరు ఆస్తిపాస్తులకోసం వితృష్ణుడై నిత్యం నైవేద్యాలతో విగ్రహారాధన చేస్తున్న మానవుడు అధ్యాత్మవాదిగా చెల్లుబడి కావడంకూడా ఇంకనూ జరుగుతున్న విషయమే. రవీంద్రుని అధ్యాత్మం పూజాపునస్కా

రాలు, తీర్థయాత్రలు, చేసే మూఢ అధ్యాత్మం కాదు. రవీంద్రుడు అధ్యాత్మం కోసం ఇల్లు వదల్లేదు. భౌతిక జీవితం లోని సుఖాలన్నిటిని కలుపుకొని ఆయన అధ్యాత్మం వికసించింది. సమాజంలో మానవజీవితాన్ని చరితార్థం చెయ్యడమే అధ్యాత్మ యొక్క ఉద్దేశమట. అదే జీవితంలోని పూర్ణత్వమట. నేటి అధ్యాత్మవాదులు జీవితానికి పూర్ణత్వం ప్రసాదించే నిమిత్తం నవనవోదయ సంస్కృతిని సైతం మేళవించి విశ్వైక్యభావాన్ని పూరిస్తున్నారు.

సైంటిస్టు, సాహిత్యకారుడు యిరువురూ సైన్సు—సాహిత్యాల ద్వారా విశాల ప్రపంచంలో ఒకే అనంత తత్వాన్ని చూడగలుగుతూ తమ తమ సాధనాల్లో పూర్ణత్వం—ఆనందానుభూతులు పొందగలుగుతున్నారు. ఇది ఫలాపేక్షలేని సత్యాన్వేషికే సాధ్యపడింది నేటి పాశ్చాత్య సైకాలజిస్టు సైతం పొందుతున్న ఆనందం యిలాంటిదే. ఈ ముగ్గురి అనుభూతి—అనుభవాలు ఒకేరకంగా బయటపడ్డాయి ఇందుకు కారణం కూడా ఒక్కటే. అది మనస్సు. సాహిత్యకారునకు, సైకాలజిస్టుకూ మనసే మూలాధారం. వీరికేకాదు—నేటి అధ్యాత్మవాదికీ మనసే ఆలంబనం అయింది. స్వీడన్ బర్గుకు కాన్సస్ సే(అంతరాత్మ) దైవం. ఉపనిషత్ కారులు కాన్సస్ (అంతరాత్మ) నే పరమాత్మగా వ్యాఖ్యానించారు. రవీంద్రుడు నేటి సైకాలజీకి, ఉపనిషత్తుల అధ్యాత్మానికి సామ్యంచూపెడుతూ అనేకఉపన్యాసాలిచ్చాడు. ఉపనిషత్ కారులు చరించిన చింతనద్వారా ఆత్మోపలబ్ధి -ఆత్మానందం పొందిన స్థితప్రజ్ఞులు. నేటి సైకాలజిస్టు

సైతం చిరంతన ఆలోచనానంతరం కాన్సస్ చేస్తున్న క్రియ-ప్రక్రియల్ని చూచి ఆనందించి కాన్సస్ చేష్టల్ని గౌరవించారు. కాన్సస్ చేసేది, చెప్పేది తప్పుకాదుట. అది శరీరం కంటె శక్తివంతమని వక్కాణించిన ధీరోధాత్తులు, ఆనాటి ఉపనిషత్ కారులూ మైత్రోపనిషత్తులో ఆత్మను శరీరాన్ని నడపే మహాశక్తిగా—'సారథి'గా వివేచన చేశారు. ప్లేటో కూడా ఆత్మకే వోటు చేశాడు. కఠోపనిషత్తు ననుసరించి ఆత్మోపలబ్ధి పొందిన మానవుడు కష్టసుఖాలను సమదృష్టితో అనుభవిస్తాడు. నేటి సైకాలజిస్టులు జీవితంలో వస్తున్న ఒడుదుడుకుల్ని స్వాభావికంగా భావించి సహించడంలోనే ఆత్మ తుష్టి పొందుతున్నారు. నేటి అధ్యాత్మవాది జీవనసరళి సైతం సుఖదుఃఖాల్ని సమభావంతో మంజూరీ చేసింది. రవీంద్రుడూ ఈకోవకు చెందిన ఆధునిక అధ్యాత్మవాది. నాటి

ఉపనిషత్తుల్ని - నేటి సైకాలజీని ప్రాణ ప్రియంగా పఠించి రెంటినుండీ ఒకేరకమైన సారం - సందేశం గ్రహించాడు. ఈశావాస్యోపనిషత్తు ప్రసాదించిన శాంతిసందేశానికి తాను చిరకృతజ్ఞుడట. ఉపనిషత్తులకు మించిన పాఠాలు - పాఠశాల ఆయనకు మరొకచోట లభించలేదట. భౌతిక జీవితమే ఉపనిషత్ కారులకు మూలాధారమై ఆనందోపలబ్ధికి కారణమైంది. ఆధునిక సైకాలజిస్టులు ఉపనిషత్ కారులవంటి ఆనంద వాదులే. కాన్సస్ చేష్టలు వారికి విచిత్రమైన ఆనందాన్ని కలుగజేస్తున్నాయి. ఉపనిషత్ పుత్రుడు రవీంద్రుడు, ఆత్మ చైతన్యంద్వారా Bliss అనే చిరంతన ఆనందం పొందిన

స్థితప్రజ్ఞుడు. రవీంద్రుడు ఉపనిషత్తుల ఆత్మ సైద్ధాంతిక సైలసాన్ని, పాశ్చాత్యుల ఆధునిక సైకాలజీని సమన్వయపరచి సాహిత్యం లోను—అధ్యాత్మంలో అభ్యుదయాన్ని ప్రతిష్ఠించి సైకాలజీద్వారా అటు సైన్సులోనూ స్వాత్మను దర్శించాడు. సైకాలజీకి సైన్సుతో ఎలాంటి విరోధమూ లేదు. పైగా బాంధవ్యం వుంది. ఇలాంటి బాంధవ్యాన్నే సైకాలజీ అధ్యాత్మంతోనూ పెట్టుకుంది ఈ పరస్పరబాంధవ్యాలే రవీంద్రునికి పూర్ణ సత్యాలు.

మనోవృత్తుల క్రమబద్ధమైన వికాసాన్ని సైకాలజీ అన్నారు. ఒక మనోవృత్తికీ మరొక మనోవృత్తికి సంబంధం వుంది. భావాల ఉత్థాన పతనాలు మనోవృత్తులకు నిత్యకృత్యాలు. మనోవృత్తికి స్థానపరిమాణ మంటూ లేదు. ప్రాణానికి వలెనే మనోవృత్తి గుణాత్మకమైన మార్పు చెందుతుంటుంది. ప్రాణానికి—మనోవృత్తికి స్వేచ్ఛకావాలి. ఆ స్వేచ్ఛలోనే వాటికి వ్యక్తిత్వం వుంది. ఈ స్వేచ్ఛతోనే మానవుడు ఆలోచిస్తున్నాడు ఆలోచనానంతరం మానవుడు ఒక నిష్కర్షకు, ఒక సంకల్పానికి వస్తున్నాడు. సత్సంకల్పంతో ఆలోచించి మానవుడు గొప్పవాడు కాగలగాడు. ఆలోచన ద్వారా బ్రహ్మను సహితం అవలోకించాడు. ఇంద్రియాలన్నీ మానవుని ఆలోచనకు, చింతనకు పునాదులు. మానవుని మనోవృత్తుల్ని ఐతరేయోపనిషత్తు నేటి సైకాలజీ కంటె మిన్నగానే విశ్లేషించి సంజ్ఞానం — అజ్ఞానం — విజ్ఞానం

ప్రజ్ఞానం—మేధ—దృష్టి—ధృతి—స్మృతి— సంకల్పం—వికల్పం వగైరా మనోవృత్తుల్ని గురించి సోదాహరణంగా వ్రాసింది. మానవుని మనోవృత్తులే అతన్ని సత్యాన్వేషణకు ప్రేరేపించాయి. మానవునికోర్కె పాపపుణ్యాల్ని రెంటినీ జనింపచేస్తుంది. ఇదంతా సైకాలజీయొక్క జీవనగాథ.

రవీంద్రుడు సైకాలజీని గురించి వ్రాస్తూ కొన్ని ఉదాత్తమైన సలహాలను లోకానికందించాడు – కోర్కెను ఉదాత్తంగా పెంచండి. దురాశా పూరితమైన అభ్యుదయం వినాశానికి, వితృష్ణకు దారితీస్తుంది. జీవితాన్ని పరిణామ ప్రధానంగా కాక – గుణప్రధానంగా పెంచండి. నేడు భవుతిక జీవన పరిణామాభివృద్ధి విషచక్రంగా పరిణమించింది. భవుతిక సంపత్తికి బోలెడంత రక్షణ కావలసివస్తున్నది.

రవీంద్రుడు తన religion of Man అనే పుస్తకంలో భవుతిక—అధ్యాత్మిక జీవితాల సమన్వయంలో అంతస్సామరస్యం చూపించాడు అంతస్సామరస్యంలో పూర్ణజీవితం – విశ్వాత్మ—అలౌకికానందం వున్నవంటాడు. అనాసక్తితో చేసే కృషివల్ల సామరస్యం లభిస్తుందట. మార్పులు–కూర్పులు గల జీవితమే మానవునకు శ్రేయస్కరమట. 'ఏకోహం బహుశ్యామ్' అనే ఉపనిషత్ వాక్యాన్ని సైకాలజికల్ గా రుజువు చేస్తాడు. అయినా రవీంద్రుడు–సైకాలజిస్టు వీరిద్దరూ ప్రధానంగా ఆత్మవాదులు. రవీంద్రుని ఆత్మవాదం ఉపనిషత్తుల అధ్యాత్మంతో నేస్తం చేసింది. సైకాలజిస్టుని 'ఆత్మ' (కాన్సస్) 'సైకాలజీ' పేరుతో ఒక ప్రత్యేక శాస్త్రంగా వృద్ధిచెందింది. రవీంద్రుడు ఆత్మను పరమాత్మోన్ముఖం చేసి ఆత్మను పర

మాత్మ యొక్క ఛాయారూపంగా ప్రతిపాదించాడు. ఆత్మ - పరమాత్మల మిలన — క్రియను భవుతికంగా ప్రేయసీ — ప్రియుల కలయికగా అభివర్ణిస్తాడు యిది ఆయనకు బృహదారణ్యకోపనిషత్తు నేర్పిన సారమట. బృహదారణ్యకోపనిషత్తు ననుసరించి ప్రేయసీ — ప్రియులు కౌగలించుకొన్నప్పుడు బాహ్యాంతర్యాల భేదం మరచేటంతటి ఆనందం పొందుతారట. అలాంటి తన్మయతా పూరితమైన ఆనందానుభూతి ఆత్మ — పరమాత్మలకు మిలనసమయాల్లో ప్రాప్తిస్తుందట.

రవీంద్రుడు మేధావి — దార్శనికుడు కావడంతో జీవితంలో స్థిరత్వం — వోర్పు నలవర్చుకొని ప్రకృతినుండి స్వేచ్ఛాస్వభావం పరిగ్రహించి ఆత్మను స్వేచ్ఛగా నిర్లిప్త నీలాకాశంగా తెరచివుంచాడు. జీవితంలో ఎలాంటి ఒడుదుడుకు పరిస్థితులకూ చలించక చల్లని వెన్నెలలాంటి శాంత స్వభావం ప్రదర్శించేడు. జీవితంలో 'ఎ నుంచి జడ్' వరకు బాలప్రవృత్తితో నిర్భయంగా — సంపూర్ణ స్వేచ్ఛతో దేశ దేశాలను పర్యటించాడు. ఏది వ్రాసినా - ఎక్కడ తిరిగినా మానసిక స్థిరత్వాన్ని మెరిపించాడు. ఆయన మానసికస్థిరత్వమే భవుతిక - ఆధ్యాత్మిక జీవితాల్ని సమన్వయపరచి బోలాపూర్ వద్ద విశ్వభారతిని స్థాపించింది. అది ఆయన ఆరణ్యక జీవితానికి అమృతచిహ్నం.

# విశ్వమానవ వాది

ఈ యిరువయ్యో శతాబ్దంలో ప్రవేశించి చరిత్ర తల్లక్రిందులుగా మారింది. చరిత్ర విషయమూ మారింది -- చరిత్రస్రష్టలూ మారారు. రారాజులను, సామ్రాజ్యాలను కొట్టివేసి స్వర్ణాక్షరాలతో అమృతవాక్కుల్తో సామాన్య మానవుణ్ణి గద్దెనెక్కించారు. గతంలో సామ్రాట్టులకిచ్చిన పేరుప్రతిష్ఠలను సామాన్యునికి కట్టబెట్టి మహనీయుణ్ణి చేశారు. ఈనాడు అతడే విశ్వపరిధికి కేంద్రబిందువు. అతనిని ఆధారం చేసుకునే సాహిత్యం - సైన్సు - తత్వశాస్త్రం - సర్వం వికసించి పరిమళిస్తున్నాయి. అణుశక్తి దగ్గరనుండీ అధ్యాత్మ్యంవరకూ అతడే లేబరేటరీ అయ్యాడు. ఇప్పుడతను లోగడ పల్లకీలు మోసిన అర్ధమానవుడు - అల్పమానవుడు కాదు; బుద్ధిబలంతో చరిత్రాంకనం చేస్తున్న పూర్ణమానవుడు. ఇంకా తన బహుముఖ శక్తులను వెలికితీస్తున్న చైతన్యమానవుడు "నేను లేనినాడు నీవూ లే" వని బ్రహ్మనుసైతం హెచ్చరిస్తున్నాడు. వర్ణ వర్గ మత వైషమ్యాలతో సమాజాన్ని విభాగించక - సమానత్వం, సౌభ్రాతృత్వాలతో వ్యష్టి సమష్టిజీవితాలను హెచ్చించి

జడచేతనాల్లోసైతం భిన్నత్వంలో ఏకత్వం పునః ప్రతిష్ఠిస్తున్నాడు ఇంతే కాదు; విశ్వశాంతికోసం యుద్ధవిరమణ, పూర్తి నిరాయుధీకరణ, అణుప్రయోగవిసర్జన యిత్యాది ప్రతిపాదనలు సామాన్యమానవుని హృదయ కుహరంనుండి వెలువడ్డవే

కవీంద్ర రవీంద్రు డనగానే ప్రథమంగా భూతలాన్ని వదిలిపెట్టి ముక్తాకాశంలో ఉషఃకిరణాలకు అంగలార్చుకొంటూ స్వాగతం చెప్పుతున్న స్వర్గవిహంగ మని, నౌక నౌకదాన్ని నెట్టుకుంటూ నదులు దాటుతున్న ఆధ్యాత్మిక ప్రయాణీకు డని, నదీనదాల ప్రవాహానికి పరవశుడై తానూ స్రవించే ఒక ప్రకృతిజీవ మని అనుకోవడం కద్దు ఇది ఆయన గీతాంజలి కావ్యజీవితం మాత్రమే. ప్రకృతినిలయంలో స్వేచ్ఛగా విహరించి అమితానందం, అధ్యాత్మానందం పొందిన రవీంద్రునిభక్తి—జీవితం గీతాంజలి అధ్యాత్మాన్ని మానవవాదం (హ్యూమానిటీ) వైపుకు మలిపిన మరొక మహాజీవితం భౌతిక అధ్యాత్మిక సమన్వయ జీవితాన్ని రవీంద్రుడు లోకానికి సమర్పించాడు. రాజభవనంనుండి శాంతినికేతనానికి రవీంద్రుడు చేసిన బౌద్ధప్రయాణం - మహాప్రస్థానం - విశ్వశాంతికీ, మానవవాదానికే దారితీసింది. ఆయన బౌద్ధుల్లా విశ్వశాంతికోసం, విశ్వమానవునికోసం సదా చింతాక్రాంతుడు. మానవులందరికీ విముక్తిలభిస్తేతప్ప నాకు ముక్తి అక్కరలే దన్నాడు గౌతమబుద్ధుడు. 'మానవులందరం ఒకే దివ్యత్వానికి బంధువులం' అన్నారు అరవింద - రవీంద్రులు ఈ భావాలు విశ్వమానవత (హ్యూమానిటీ)కు

మూలకందాలు. అదినుండి తత్వవేత్తలు, తత్వవేత్తలైన కవులు విశ్వశాంతికోసం, లోకంసుఖంకోసం స్వసుఖాన్ని, స్వసంపత్తిని త్యాగంచేసి, త్యాగాన్నే భోగంగా మార్చిన మానవవాదులు.

"మానవజాతినంతటిని సేవించడంద్వారా ఆ పరమాత్మను సేవించగలం - మానవునిలోని భగవత్స్వామను పరిపూర్ణం చేయడానికి మానవసేవే ఉత్తమమైన"దని మరొక మాట హెచ్చరించారు త్రిమూర్తులు అరవింద -రవీంద్ర - గాంధీమహాత్ములు.

"మానవాళి అంతటా ఒకే ఆధ్యాత్మికసమాఖ్యలో సమానభాగస్వామి. చేతన అచేతనాత్మక సృష్టికి మానవుడు కిరీటము వంటివాడు. సృష్టికర్తకు అతడొక ప్రతినిధి... మానవతే మానుషధర్మం దాన్ని కోల్పోయిననాడు మానవుడే నశించిపోగలడు. సర్వత్రా స్వాత్మను దర్శించడంతో విశ్వమానవత సిద్ధిస్తుంది వ్యష్టినుండి సమష్టికి - విశ్వానికి ప్రయాణం చెయ్యడమే విశ్వమానవత... శత్రువును, అపరిచితుని గౌరవించడంతో అది అలవడుతుంది." ఇది రవీంద్రుని విశ్వమానవ హృదయంనుండి విస్తృతమైన మానవతా సారం.

భౌతికజీవితాన్ని అభిశాపంగా భావించి ఈప్రపంచం నుండి తెగతెంపులు చేసుకొన్న నిరాశావాదులు - తాత్వికులు లేకపోలేదు. తిరిగి మానవుని సన్నిధికే చేరి ఈ లోకానికి మానవజన్మ వొకవరప్రసాదంగా గుర్తించిన తత్వవేత్తలూ అనేకం. అణుఅణువును ఆత్మరంజితంగా దర్శించి

చైతన్యమానవుడే దైవస్వరూపు డన్న సత్యం కనిపెట్టి ఆధ్యాత్మాన్ని మానవపరం జేసిన మహాత్ములకు కొరత లేదు. 'On science is God's Presence.' అని స్వీడన్ బర్గ చైతన్యమానవునికి దైవస్వరూపం ప్రతిపాదించాడు. రవీంద్రుడు సైతం దైవాన్వేషణలో ఎంతో ఘర్షణపడ్డాడు, తపన చెందాడు. దైవాన్వేషణలో ఆయన ఆత్మ ఇల్లిల్లూ తిరిగింది. గుళ్ళన్నీ గాలించింది, ఎంతో ఆరాటపడింది, అలసి సొలసి పడిపోయింది. ఇంతలో రవీంద్రుని ఆరాధ్యుడు అంతరాత్మనుండే పలికాడు – నేను నీవద్దనే వున్నాను. ఎక్కడెక్కడ గుళ్ళన్నీ తిరిగినచ్చావా మూర్ఖుడా ? గుళ్ళల్లో ఎవర్ని పూజిస్తున్నావోయ్ పూజారి? ఈ మాటలు విని కవిహృదయం పులికిపడింది. శ్రమంతా వృధాఅయిందే! ఆలయాన్ని వెదకడం తప్పే అయింది ముందు నాలో నేవెదికి పిదప లోకంలో చూడవలసింది_అని ఆత్మ పశ్చాత్తాపం చెందింది. అంతరాత్మనుంచి మళ్ళీ ఆరాధ్యుడు పలికాడు. చుట్టూ అంధకారమనే కంచె వేసికుని ఏకాంతంగా ఎవరిని ధ్యానిస్తున్నావోయ్ పిచ్చిపూజారి? కళ్ళు తెరువు – నీదైవం నీ ఎదుట లేడు. ప్రపంచాన్ని త్యజించి నిర్జనప్రదేశంలో నివసించడంతో దైవం ప్రాప్తించదు. ఇంద్రియద్వారాన్ని బంధించడంతో దైవసాక్షాత్కారం కాదు. మోక్షం పేరుతో మోసం చెయ్యకు. పూజాసామగ్రిని విసర్జించు – కర్మక్షేత్రానికి తరలి వెళ్ళు. కృషీవలులు పనిచేస్తున్న పొలాలకు పయనమవ్వు. రాళ్ళు కొడుతున్న కూలీలను చూడు. నీ భగవాన్ వాళ్ళతో పాటు

ఎండవానల్లో ఎండుతూ తడుస్తున్నాడు. అదిగో! అటు చూడు, నీ భగవాన్ రెండుచేతుల్లో మట్టిముద్దలు పట్టుకొని వున్నాడు. నివ్వూ నీ పట్టుబట్టలు వదిలేసి భగవాన్‌తోపాటు మట్టిముద్దలు పెయ్యమని క్రింది విధంగా పిలుస్తున్నాడు—

తారి మతన శుదివసన చాడి
ఆయిరే, ధూలార పరే –
సబారపీచె, సబారసీచే
సర్వహారాధె రమాయే...

కృషీవలుడే రవీంద్రుని కృష్ణుడు. రవీంద్రుడు కార్మిక-కర్షకుల్లో, దీనజనకుటీరాల్లో, సర్వహారుల్లో భగవానుని దర్శించాడు. రమణ మహర్షి సహితం దీనజనసేవలోనే దైవాన్ని చూపించాడు. రమణమహర్షి నిత్యం నిద్రలేవడంతోనే మొదలు 5–6 గంటలయేవరకూ దీనజనసేవా శుశ్రూషల్లో మునిగి తేలేవాడు. పీడితహృదయాల్లోనే దైవ సాక్షాత్కారం చేశాడు. ఒకనాడు రమణమహర్షిని మీ దైవాన్ని చూపవలసిందిగా ఆశ్రమానికి వచ్చిన అతిథులు కోరారు. మరునాడు ఉదయం తెల్లవారుజామున అతిథులను వెంటబెట్టుకొని వెళ్ళి ఒక దీనజనకుటీరంవద్ద ఆగాడు. తాను లోపల ప్రవేశించి బాధతో మూల్గుతూ పడివున్న దీనురాలి సేవచేయ ప్రారంభించాడు. ముంగిట నిలబడివున్న అతిథులతో 'ఈ దీనురాలే నాదైవం' అని నిండుమనసుతో ఉచ్చ

రించాడు ఆశ్రమ జీవితానికి అధిపతులై తరతమ భేదాలకు తిలోదకాలిచ్చి ఆదరాభిమానాలతో అనాథులసేవ చేసిన మహాత్ములకు - తాత్వికులకు ఈ దేశంలో కొరత లేదు. నాటి కృష్ణపరమాత్మనుండి నిన్న మొన్నటి గాంధీమహాత్ముల వరకూ పీడతప్రజాసేవను మాధవసేవగా నూర్చుకొన్నారు. రవీంద్రుడు అస్వస్థులుగా వున్న శాంతినికేతన వాసులకు యధోచిత ఉపచారములు చేస్తూ ఆశ్రమ పారిశుద్ధ్యానికి నడుంకట్టి పనిచేసేవాడు. మహాత్ములు తమ అద్వైతానికి— - ఆధ్యాత్మిక సాధనకు పీడితమానవసేవ నొక ప్రాక్టికల్ వర్కుగా భావించారు.

రవీంద్రుని 'విశ్వభారతి' కూడా వర్ణ వర్గ మత వైషమ్యాలకు అతీతంగా మానవత (హ్యూమానిటీ)కు మహానిలయమై ఆయన అధ్యాత్మానికి ప్రయోగశాలగా పని చేస్తూ వుంది. రవీంద్రుడు విశ్వభారతిని స్థాపించినాడు. మిత్రుడు లాస్ ఏంజిలస్‌కు విశ్వభారతి స్థాపనోద్దేశ్యాన్ని వివరిస్తూ వుత్తరం వ్రాశాడు—"బోల్‌పూర్ మైదానంలో వివిధజాతుల భావి ఏకీకరణకు ఏర్పాట్లుచేస్తున్నాను. బోల్‌పూర్ భౌగోళిక హద్దులకు అతీతంగా సీమారహితంగా వుంటుంది. సమ స్తమానవజాతికి యిచ్చట ఏకైక జెండాను ఎగురవేస్తున్నాను" అని. రవీంద్రుని అనంతరం ఆయన విశ్వభారతి వివిధ మతస్థులకు ఏకకుటుంబంగా వుండి కల్మష రహితంగా పని చెయ్యడం విశ్వమానవతకు తలమానిక మని పించింది.

6)

"ఉదారస్వభావం—జీవకారుణ్యం లేనంత వరకు మానవుడు విశ్వమానవుడు కాజాలడట అధ్యాత్మానికి కావలసింది ఈ జీవకారుణ్యమేనట. ఒక్క అధ్యాత్మమే మానవులను సమంగా చూడగలుగుతుంది" ఇలాంటిసమన్వయ భావాల సమ్మేళనంతో రవీంద్రుడు క్రొత్తవాదాన్ని-ఆధ్యాత్మిక మానవవాదాన్ని సృష్టించగలిగాడు. సాహిత్యంలో సర్వత్రా స్వార్థం, అధికార వాంఛలేని విశ్వమానవుణ్ణి, భౌతిక, ఆధ్యాత్మలను కలిపి చూడగల విశాలదృష్టిని అభివర్ణించాడు. యంత్రగతమైన జీవితంలో అంతస్సాన్యం లేదట. నాలుగుగోడల మధ్య పెరిగిన నాగరికజీవితంవల్ల మానవుని దూరదృష్టి, దూరశ్రవణ శక్తులు క్షీణించిపోతాయట భౌతికంగా అభివృద్ధి చెందిన జీవితానికి స్వేచ్ఛకూడా తక్కువట. జీవనాభ్యుదయం స్వేచ్ఛగా వుండాలనే కాంక్షతో తాను విశ్వభారతిని స్థాపించాడట. విశ్వమానవ రాజ్యంలో అన్యాయం చేసేవాడూ, అన్యాయం సహించేవాడూ శిక్షార్హులని రవీంద్రుడు యిరువురినీ దండించుమని దైవాన్ని ప్రార్థించాడు. విశ్వమానవ రాజ్యంలో (హ్యూమానిటీ) లో అతి చిన్నవాడూ, అతి పెద్దవాడూ ఒకే గౌరవ ప్రతిష్ఠలు పొందుతారని ఈవిధంగా వ్రాస్తాడు: "సముద్రానికున్న గౌరవస్థానం సముద్రానికుంది. చిన్ని వాన బొట్టుకున్న గౌరవం దానికుంది. సముద్రాని కెక్కువ గౌరవం, వానబొట్టుకు తక్కువగౌరవమనే ప్రశ్నలేదు. అదేవాన బొట్టు ముత్యపుచిప్పలోపడి ముత్యమౌతుంది. ఆ జలబిందువులు వర్షించే పృథ్వి చిగుర్చుతుంది. అలాగే కర్మక్షేత్రం

లోనూ, దేవుని ఆస్థానంలోనూ ప్రతిమానవుడూ సమగౌరవం పొందుతాడు" ఇలాంటి అనేక ప్రమాణాలతో రవీంద్రుడు విశ్వమానవతను ఋజువుచేస్తాడు. రవీంద్రుని దేశదేశాలపర్యటన, దేశదేశాలసంస్కృతీ సభ్యతల సమన్వయం ఆయన విశ్వమానవతకు మరింత మెరుగులు పెట్టాయి. పర్యటించిన దేశాల్లో, తానిచ్చిన ఉపన్యాసాల్లో మానవత విద్యుద్దీపంలా మెరసి సభాసదులకు నవ జీవనం ప్రసాదించేది. దేశపర్యటన రవీంద్రునకు పిక్‌నిక్ లాంటిది. నలుగురుతో కలసి తిరగడమంటే ఆయనకు మహాప్రీతి. ఆయా దేశవాసులను కలుసుకొని అమితానందస్థితికి వచ్చేవాడు. మానవ సంకల్పంముందు, దైవసంకల్పం సహితం పరాజితమౌతుందంటూ మానవుణ్ణి అమృత పుత్రుడుగా చెప్పి గౌరవించాడు. దేవతలను జయించిన మానవుని పుణ్యగాథల నెన్నింటినో పురాణాలనుండి ఎత్తిచూపించేవాడు.

'ముందు మనం మానవులం—తరువాతనే పండితులమైనా, మరి అధికారులమైనా, అని సామాన్య మానవుని కున్న గౌరవం చూపిస్తూ ప్రతిమానవునికి ఆత్మగౌరవం, ఆత్మసౌందర్యం, ఆత్మశ్రేయం కావాలి' అని హెచ్చరించాడు. మానవుడు ఆత్మారాముడు కాగలిగిననాడే అతనికి మానసిక స్వాతంత్ర్యం, స్వయంప్రకాశం లభిస్తవట దేశనాయకులంతా జాతీయతకోసం పోరాడుతున్న రోజుల్లో రవీంద్రుడు విశాలహృదయంతో దేశదేశాలు పర్యటించి

విశ్వమానవతను పోషించాడు. మేధావు లెప్పుడూ స్వపర భేదాలకు తావియ్యక పర్వతశిఖరాన్నుండి భూతలాన్ని ప్రవహించే మహానదులవలె సామాన్య మానవునిలో కలసిపోతారు. మహారచయితలు పీడిత హృదయాన్నుండి ప్రవహించే కన్నీటితోనే ఉత్తమసాహిత్యం సృష్టిస్తారు. రవీంద్రుడు ఎంత అధ్యాత్మవాది అయినా ఒక మహారచయిత, కవి అన్నమాట మరువరానిది. భౌతికజీవితాన్ని అంటిపెట్టుకొని పృథ్వీగీతాలనే ఘనంగా పాడాడు మానవుణ్ణే ప్రేమించాడు. మానవునికోసం పృథ్వీకలశాన్ని అమృతంతో నింపాడు అది నానారంగుల్లో సుగంధపరిమళాల్తో నలుదిక్కులా వ్యాపించింది. ఇక ఈలోకాన్ని వదలిపెట్టడానికి సుతరామూ యిష్టపడలేదు. పృథ్వీగీతాన్ని యిలా ఆలాపించాడు—

ఏయి వసుధార్
మృత్తికారపాత్రఖని భరిబారంజార్
తోమార్ అమృతఢాలిదిబె అబిరత
నానావర్ణ గంధమయ—

రవీంద్రుడు భౌతికజీవనమాధుర్యంలో మునిగి మృత్యువునే మరచాడు. మానవరూపంలో మానసాలమధ్య బ్రతకాలి—ఇదే ఆయనకు కావలసిన మోక్షం. ఈభావాన్ని ఈక్రిందివిధంగా గానంచేశాడు —

మరితేచాహినా, అమిసుందర భువనే
మానవే రమిాఖ్, అమిబాచి బేరచాయి.

పతంజలి యోగాభ్యాసంద్వారా లభించే ముక్తి మోక్షాలు రవీంద్రుని కవుసరం లేదు. మోక్షం పొంది తానొకదైవం కావాలనీ కాంక్షించలేదు. శాంతిని కేతనం స్థాపించి వైరాగ్యమూ బోధించలేదు. అది ఆయన అభీష్టమూ కాదు. అనురాగంతోనే జీవితం మలిపి మానవుడుగా బ్రతకడమే మంచిదని నిశ్చయించుకొనదగు పుత్రులనే నమ్ముకున్నాడు. సైగా ముక్తికాముకుల్ని హేళనచేశాడు--ఓ ముక్తికామి! నాకు ముక్తి ఎలా లభిస్తుందోయ్? భగవానే స్వయంగా సృష్టిబంధనాల్లో చిక్కుబడి మనందర కడకు వస్తున్నాడు. ముక్తికోసం చేసే సంధ్యావందనాలు వదలిపెట్టు. చెమటోడ్చి పనిచెయ్యి కర్మయోగం ద్వారా భగవాన్‌తో ఐక్యమైపో—

వైరాగ్యసాధనే ముక్తి సే అమారనయ
అసంఖ్య బంధనమాఝే మహానందమయ
లభివభు ర్తి రస్వాత......

అని వైరాగ్య మోక్షాలను వ్యతిరేకించాడు. మానవానురాగంతో మనసు నింపుకున్నాడు. కవీంద్రుని మానవానురాగమే దేశదేశాలు త్రిప్పింది. విశ్వమానవునికోసం ఆసురీశక్తులతో యుద్ధంచేసి కవీంద్రుని విశ్వమానవతను చిందిస్తున్న కింది గేయం చూడండి—

సబ్ ఠాయీమోరఘర్ అఛే, అమి
సేయిఘర్ మరిబు జియా

দেশ দেশে মোর দেশ আছে, আমি
সেই দেশ লব যুঝিয়া।

ఏమార్గాన అనంత జనసముదాయం ప్రశాంతంగా సాగిపోతుందో ఆమార్గాన నన్నూ తోడ్కొనివెళ్ళి వాళ్ళల్లో నిలబెట్టండి. నేనూ యుగయుగాంతరాల విరాటరూపం చూస్తాను- అంటూ జనసముదాయాన్ని దైవసమంగా భావించి గౌరవించాడు. 'మానవాపమానం, మానవశోషణ సహించలేను జీవితాన్ని సమాజాన్ని క్షణక్షణం ముక్కలు ముక్కలుచేసి క్షతగాత్రం చెయ్యడం అసలే సహించను' అంటూ సమష్టి జీవితంకోసం అభ్యుదయకవిగా గర్జించాడు. విశ్వమానవతను అహం, అధికారాలపరిత్యాగం వాటిస్థానంలో ప్రేమానురాగాలను ఉపాదేయంగా పరిగ్రహించాడు. అహం, అధికారాలను జయించిన ప్రేమను గురించి పొట్టికథ వ్రాశాడు. 'అధికారం' 'ప్రేమ' ఒకనాడు 'నేనుగొప్ప' నంటే నేనుగొప్పవని వాదనపడ్డాయి. అధికారం లోకంతో అంటుంది-నీవు నాచేతిలో కీలుబొమ్మవు- నీవు నాగుప్పెట్లో బందీవి. లోకం చిటుక్కున అధికారాన్ని (పవర్) కాళ్ళుచేతులు కట్టివేసి కుర్చీలో కూర్చోపెట్టింది. అధికారం గిలగిలా తన్నుకుంది. లక్షప్రయత్నాలు చేసినా వదిలించుకోలేకపోయింది. ఇంతలో ప్రేమ వచ్చింది. లోకంతో యిలా అంది : 'నేను అన్నివిధాలా నీదాన్ని.' లోకం పులకితహృదయంతో తన యావత్తుగృహ వెత్తనం ప్రేమ కప్పగించింది. రవీంద్రుడు ప్రేమకు విజయం చేకూర్చే

యిలాంటి కథలెన్నో గద్య, పద్యం అనే తేడా లేకుండా వ్రాశాడు. రవీంద్రుడు మూలంలో ప్రేమకవి. మహాకవులూ, మహాత్ములూ సర్వత్రా విశ్వమానవప్రేమికులు. వారు ఎక్కడా అధికారానికి, డబ్బుకు, శాసనానికి లొంగలేదు. భార్య, బిడ్డలకు విలువైన బట్టలు వేస్తున్నా — పౌడరు వ్రాస్తున్నా చూచినప్పుడు అంటూవుండేవాడు—'డబ్బుతో పిల్లలను మానవులను చేద్దామనుకుంటున్నావా? పౌడరు వ్రాసుకునేవారంతా అనాగరికులు' అని. రవీంద్రుని వ్రాతలతో పాటు చేష్టలలోనూ విశ్వమానవతే వికసించింది.

# 'బ్లిష్' అనే చిరంతన ఆనందం

లోకంలో జీవితంతో వ్యాపారం చేసే వ్యక్తులూ వున్నారు. రెండో వైపు కళాదేవతకు జీవితాన్ని నైవేద్యం పెట్టే కళోపాసకులూ వున్నారు. కళోపాసకుడు జీవితాన్ని ఖర్చుపెడతాడు. వ్యాపారి జీవితాన్ని ఖర్చు కానివ్వడు: వ్యాపారి జీవితం నానాటికీ సంకీర్ణమైపోతున్నా, తాను సంపాదించే డబ్బుకు సంరక్షకుడుగా మిగిలిపోతాడు. కళా రాధకుని జీవితం నానాటికీ విస్తీర్ణమవుతుంది. కళగా బ్రతికే జీవితంలో ఆత్మోత్సర్గం - ఆత్మానందం జంటగానడుస్తాయి. కళారాధకుడు, కవి సూర్యుడిలా ఉదయించి సూర్యుడిలా అస్తమించే సిరిసంపదల్ని - అధికారాన్ని పట్టించుకోడు. వీటితో నిర్లిప్తంగా వుంటూవున్న అపరిగ్రాహి రవీంద్రుడు సత్యనిష్ట - పరదుఃఖకాతరత ఆయన సుగుణాలు. ఉదార స్వభావంతో సదా ఆనందవాది. సమస్త విశ్వం ఆత్మవత్ సర్వ భూతేషు వంటిది. అదే ఆయన సార్వజనీనత - విశ్వ భాందవ్యం. కవి అంతర్ద్రిష్ట. అంతర్దృష్టితో ఆత్మ వికాసం పొందుతాడు ఈ సైన్సుయుగంలో కళారాధకుని ఆత్మ వికాసం కొంతవరకు కుంటువడుతున్నదనేచెప్పాలి. అయినా

నిష్ఠతో ఆత్మవికాసం పొందుతూనే వస్తున్నాను. ఆత్మా నందం లభిస్తూనే వుంది.

కవి అధ్యాత్మంలో ఆనందవాది - కావ్యంలో రస వాది. రసపుష్టిలో కవికి ఆత్మతుష్టి వుంది. ఒక్క కావ్యం లోనే కాదు, జీవితంలోనూ అడుగడుగునా అనందాన్నే వెతుకుతాడు సృష్టిలోని ప్రతి అణువూ ఆనందాన్నే ప్రసా దిస్తుంది. ఈ అందమైన భవనంలో నేను చావుగోరడం లేదు. మనుష్యులమధ్యే జీవించాలను కొంటున్నాను, అంటాడు ఆనందవాది రవీంద్రుడు గీతాంజలిలో. ఆనందవాదులు అహం, ఇదంల సమ్మేళనంతో ఆనదమే పొందుతారు. 'ఈశావాస్య మిదం సర్వం యత్కించ్యామ్ జగత్ జన్మ: ఉపనిషత్ వాక్యం రవీంద్రునికి ప్రియమైన వాక్యం. లోకం లోని ప్రతి వస్తువు ఈశ్వరాభిభూతమై ఆయనకుఆనందాన్నే ప్రధానం చేసింది. ప్రతిదాంట్లోనూ సౌందర్యమేఉట్టిపడింది. అందుకే కాబోలు తన ఆరాధ్యుణ్ణి సుందరుడని పిలుచు కున్నాడు. సరిత సముద్రంలో విలీనమైన చందాన తానూ ఆరాధ్యుడు 'సుందర్'లో విలీనమయ్యాడు. ఆయన ప్రాణా లకు విశ్రాంతి, మనసుకు ఆనందం, ఆత్మకు శాంతి - లభిం చాయి.

రవీంద్రునకు శాంతి ఆనందాలు ప్రసాదించిన శ్రేయస్సు ప్రకృతిమాతకే దక్కింది. ప్రకృతి నివాసంతో సౌందర్యానుభూతి, ప్రకృతి దర్శనంతో ప్రభుసాక్షాత్కారం

ఒక్కుమ్మడిగా ప్రాప్తించాయి. తనకు ప్రభు జ్ఞానను సైతం కలుగజేసింది ప్రకృతేనట! ప్రకృతిమాత ఒడిలో తానొక పక్షిగా స్వేచ్ఛావాయువు పీల్చాడు, ప్రాణవాయువులా బ్రతికాడు. మానవుణ్ణి పక్షితో పోల్చి యిలా చెపుతాడు. 'పక్షికి గూడు, నభం రెండూ కావాలి. మనిషికి హద్దులున్న ఇల్లు కావాలి. ఇంటిలో తిండి – విశ్రాంతి తీసుకుంటాడు. స్వేచ్ఛగా విహరించటానికి మరొకటి ముక్తాకాశం కావాలి. అది మానవజీవితానికి గతి (మూమెంటు)ని ప్రసాదిస్తుంది.

ఋషులంతా ఏకాంతవాసులు ప్రకృతిలో విహరించిన స్వేచ్ఛాజీవులు. రవీంద్రుడు మహర్షుల శ్రేణికి చెందినవాడు. ఆయనదొక ప్రత్యేకమైనబాట. ఆనాటి తపోవాసులు జ్ఞాన – యోగ మార్గాన దైవసాక్షాత్కారం చేసేవారు. రవీంద్రుడు కవీంద్రుడు గనుక ప్రేమ సౌందర్యాల సాధనాలతో ప్రకృతి సౌందర్యంలో ప్రభువును దర్శించాడు. ఆధునిక భావకవులందరూ సౌందర్యంలో పరమతత్వాన్ని సాక్షాత్కరించిన మహానుభావులు, రవీంద్రునకు సూర్యోదయ సూర్యాస్తమయాలు, ఆధ్యాత్మిక సౌందర్యము సందేశం యిస్తాయి. నీలాకాశం, పచ్చని పృథ్వి. ప్రకాశించే నక్షత్రాలు యివన్నీ ఆయనకు ఆనంద నిలయాలు. అన్నింటా ఆ ప్రభువు పిలుపే వినిపించింది. తానూ హృత్తంత్రిని మీటుతూ జవాబిస్తాడు 'చిరసుందరా! నీ పిలుపు విన్నాను, అమితానందం పొందాను నీవంపిన జాబుకు జవాబు వ్రాస్తున్నాను. నీవు నక్షత్ర దీపాలు వెలిగించి నన్నానందింపజేస్తు

న్నావు. నేనూ దీపాలు వెలిగిస్తున్నాను. ఎన్నటికీ ఆరని దీపాలు. మాల నొకటి కడుతున్నాను, ఎన్నటికీ వాడని పూవులవి. నీవు ప్రసాదించిన అనంతశక్తితో నిన్ను గౌరవిస్తున్నాను' అని చిరంతన ఆనందంతో పాడుకున్నాడు.

మానవ జీవితాన్ని ప్రకృతి అంశగా భావించి ప్రకృతిలో తాదాత్మ్యం పొందిన మహాకవి రవీంద్రుడు. సౌందర్యం యొక్క మూలతత్వాలు ప్రకృతిలోనే చూపించిన నవనవోన్మేషి. భౌతికవాదం యంత్రాన్ని సృష్టించి ప్రకృతి సౌందర్యాన్ని సంహారిస్తున్నదని 'ముక్తధార' నాటికలో విమర్శించాడు.

ఒక్క సౌందర్య సాహిత్యాలే కాదు. సంగీతం కూడా రవీంద్రుని స్తాత్తే నిలచింది. సంగీతానికి రెక్కలున్నవట. అది రెక్కలు కట్టుకొని అనంత ప్రభువుని చేరుకొంటుందట. రవీంద్రునికవిత సౌందర్య సంగీతాలను మేళవించి అహం, ఇదంలకు ఆనందం ప్రసాదించిన దనడంలో సందేహం లేదు. ఆయన జీవితం త్యాగాన్ని భోగంగా మార్చి 'యత్కించ జగత్యాం జగత్' సిద్ధాంతాని కనుగుణంగా ఉపనిషత్ కారుల బాటలో జీవయాత్ర చేసింది. అది ఆయన ఆనందమయ జీవితం.

కావ్యంలోనూ – ఆధ్యాత్మంలోనూ ఆనందాన్వేషణ చెయ్యడం లోకానికి క్రొత్తదేమీకాదు. భారతీయ దర్శనాలన్నీ Bliss అనే చిరంతన ఆనందాన్నే లక్ష్యంగా పెట్టుకొని వికసించాయి. ఉపనిషత్ కారులు, వైష్ణవ భక్తులు, శైవమత

స్తులు అందరూ హృదయాల అభిన్నత ద్వారా ఆనందాన్ని ప్రతిష్ఠించిన ప్రయోక్తలు. ఈశావాస్యోపనిషత్తు యందలి శాంతి పాఠాలు, ఆనందాన్ని ప్రబోధించాయి. శైవదర్శనాల్లోని శివుడు ఆనంద స్వరూపుడు. 'నటరాజ' రూపంలో శివుడు ఆనంద వర్ధనుడు. భాగవత ప్రేమలోని మాధుర్య భావం, అతీంద్రియ భావన, ఆత్మీయతలు చిరంతన ఆనందాన్నే అందించేయి మధ్యయుగంనాటి వైష్ణవభక్తిలోని 'శేషశేషి' 'దాస - స్వామి' భావాలు, కృష్ణకావ్యం "భాగవత ప్రేమ" లోనున్న మధురభక్తి, గీతాంజలి కృతికి భిక్ష పెట్టింది. కాని వైష్ణవమతంలోని వర్ణాశ్రమ ధర్మాలు, కర్మకాండల్ని పూర్తిగా వ్యతిరేకించే వైష్ణవ భక్తినికొక క్రొత్తరూపం - సంప్రదాయవిరుద్ధమైన వ్యాపక రూపం, విశ్వాత్మకరూపం ప్రసాదించాడు. రవీంద్రుడు సర్వాత్మవాదిగనుక విశ్వప్రేమ, విశ్వ సౌందర్యంలో పరమ తత్వాన్ని తొంగిచూసేడు. ఇంకా సామూహిక ఆనందం ద్వారా విశ్వాత్మతో తాదాత్మ్యం పొందగలిగాడు.

రవీంద్రునిది ఆశ్రమ జీవితమైనా ఏకాంతవాసం మాత్రం కాదు. ఆయన స్థాపించిన శాంతినికేతనం సామూహిక జీవితానికి ప్రతిరూపం అయింది. ఇంకా రవీంద్రుడు మహాకార్యం - కవిత్వం ద్వారా ఆధ్యాత్మిక సాధన చేశాడు. సాహిత్యం కూడా ఒక ఆధ్యాత్మిక సాధన అని అంటారు. సాహిత్యకారుని జీవితం సామూహిక జీవితాన్ని బలపరుస్తుందట. సాహిత్యకారుడై ఉండికూడ అరవిందుడు ఏకాంతవాసి. యోగాభ్యాసం ద్వారా అంత

ర్ముఖుడై ఆధ్యాత్మిక సాధన చేసేడు. ఇంద్రియాల్ని బంధించి చేసే యోగసాధనగాని శంకరుని శుష్కజ్ఞాన యోగంగాని రవీంద్రుడు చెయ్యలేదు. ప్రేమ ప్రధానమైన భాగవత భక్తితో విశ్వప్రేమ – ప్రకృతి ప్రేమల్ని సమన్వయపరచి నలుగురిమధ్య కలసిమెలసి ఉంటూనే ఉపనిషత్ కారుల మార్గాన ఆధ్యాత్మిక సాధన చేశారు.

చిరంతన ఆనందానికి భాగవతప్రేమ పెట్టినది పేరు. భాగవత ప్రేమకు రాధాకృష్ణులు నాయికానాయకులు. వాళ్ళది సాత్విక ప్రేమ. కృష్ణకావ్యం సర్వత్రా మధురభక్తికి నిగూఢతకు నిలయమై ఆబాలగోపాలాన్ని ఆనందంలో ముంచి తేల్చింది. ప్రబంధాల్లో వర్ణించి పెట్టిన నఖశిఖవర్ణనలకు తావియ్యక, అంతటా మానసిక సౌందర్యం సాత్విక ప్రేమనే పుష్టిచేసింది. ఇది జానపదప్రేమ. భాగవత కవులు హృదయాన్నొక గోపికగా, పరమ తత్వాన్నొక కృష్ణుడుగా అభివర్ణించి ప్రణయకలాపాన్ని చిరంతన ఆనందంగా ప్రతిపాదించారు. జానపదప్రేమను తగిన జానపదభాషనే కావ్యంలో ప్రయోగించారు మధ్యయుగంనాటి జయదేవుడు – విద్యాపతి చండీదాసు – సూరదాసు – మీరాబాయి వగైరాలు రాధాకృష్ణుల సాత్విక ప్రేమను చిరంతన ఆనందానికి పరాకాష్ఠగా గైకొని రాధ పాత్రను తన్మయత్వం – భావుకత్వంతో నింపిపెట్టి కృష్ణుని ప్రాణాల్లో అంతర్నిహితమైవున్న ఒకే రూపంగా చిత్రించారు. వైష్ణవ మతప్రణేత వల్లభాచార్యుడు 'బ్రహ్మ'ను సచ్చిదానంద స్వరూపుడుగా—కృష్ణావతారంలో ప్రవచించాడు. కృష్ణుడే బ్రహ్మ. గోలో

కమే వైకుంఠం. గోకులవాసమే మహాభక్తుల స్థిరనివాసం—
చిరవాంఛ.

వల్లభాచార్యుని పుష్టిమార్గం కృష్ణానుగ్రహంతో తయారైంది. సృష్టి అంతా కృష్ణమయం కృష్ణోపాసకుడు మధురభక్తితో కృష్ణమయుడై చిరంతన ఆనందం పొందుతాడు. సూఫీకవుల ప్రేమోపాసన యిలాంటి మధురభావల సృష్టించింట పరిణతినొందిది ఆధ్యాత్మిక ప్రతిబింబ సిద్ధాంతం భక్తకవులందరూ అధ్యాత్మిక ప్రేమను దాంపత్య ప్రేమానుభూతితో అన్యోక్తి - రూపకాలంకారాల్లో అభివ్యక్త చేశారు. వారే ఆ దైవిక క్లేశాన్ని యువ దంపతుల విరహతాపంలో పోషించి మధురంగా గానం చేసేరు ప్రియురాలి పాత్ర ధరించిన ఆత్మప్రియుడి వేషంలోవున్న పరమాత్మ పెట్టే బాధల్ని మహానందంగా అనుభవించింది. బాధ పెట్టిన కొద్దీ ప్రియుడు దగ్గరపడుతుంటాడు అది చిరంతన ఆనందానికే దోహదమిస్తుంది. ప్రియుని కత్తిపోటుసైతం మధుర స్మృతినే వెలిగిస్తుంది. కృష్ణ వియోగంలోనున్న రాధ సుఖానుభూతినే పొందుతూ సంయోగినిగా సంతృప్తి పొందుతుంది. మనోవాక్కాయ కర్మల్లో నిజాయితీనే వ్యక్తం చేస్తుంది. ఇది భక్తకవులు సృష్టించిన ఆత్మ చిత్రణ

రవీంద్రుడు జయదేవ్ - విద్యాపతి - కబీరు-మీరా లాంటి భక్తకవి. రవీంద్రుడు వైష్ణవ ప్రేమను ప్రతిపాదించి నను తన కావ్యానికి వైష్ణవమతం అనే లేబుల్ మాత్రం అంటించలేదు. వైష్ణవ సంప్రదాయంలో ఉన్న అహింసా

తత్వం - నిష్ఠ-సదాచార సంపన్నత - ఉదారస్వభావం నైతిక బలం - అంతః కరుణ, శుద్ధి యిత్యాదుల్ని అల వర్చుకుని జయదేవ్ - విద్యాపతులవలె స్వతంత్రంగా భగవత్ప్రేమను ముక్తగానం చేశాడు. తర్కానికి తావియ్యక సదా స్వానుభవాన్నే అభివ్యక్తీకరించాడు. ఆత్మ పరమాత్మల ప్రేమను దాంపత్య ప్రేమగా అభివర్ణించినా ప్రబంధాల్లోని పచ్చి శృంగారానికి దూరంగా ఉండి మధుర భక్తితో అలౌకిక ఆనందాన్ని ఆస్వాదించాడు. ఉల్లాసమయుడైన పరమాత్మను భజిస్తూనే భౌతిక జీవన యాత్రను సంపన్నం చేసుకున్నాడు.

రవీంద్రుని హృదయం పరమాత్మకోసం పరితపిస్తుంది. పరమాత్ముని విరాటత్వానికి ఆశ్చర్యచకితుడై జిజ్ఞాసతో కవి ప్రకృతిని ప్రశ్నిస్తాడు. సమాధానం రాదు-జిజ్ఞాస శాంతించదు. కవి కెక్కడనుండో వేణుగానం వినిపిస్తుంది. గానం ఎక్కడనుండి వస్తున్నదో - ఎవరు పాడుతున్నదో తెలీదు. కాని వేణుగానంలోవున్న మాధుర్యం కవి ప్రాణాల్ని పులకరింపజేస్తుంది. కవి చిరంతన ఆనందంలో మునిగి తేలుతూ ముందుకు సాగిపోతాడు. ఆ గానం మరీ దూరాన పడుతుంది. దాన్నెలా చేరుకోవాలో కవి కర్థంగాదు. ఈభావాన్ని క్రిందివిధంగా పాడుకున్నాడు.

'తోమారవాంశిరి స్వరే విమోహితమన్ -
మానవేరా ! ఓ స్వర లక్ష్మి కరిహామ్,
జన అగ్రసర హాయ తతయి జెయర
కోథోయ్ బాజిఛే తాహా బుఝి తేనాపార

లక్ష్యస్థానం కనుగొనడంలో కవికి ఆనంద-విషాదాలు రెండూ కలిగాయి.

రవీంద్రుని ప్రేమ మార్గంలో భావోన్మాదంలాంటి హిస్టీరియా ఎక్కడా కనుపించదు. తన భగవద్భక్తిని గురించి యిలా వ్రాసేడు. «భావోన్మాదం - జ్ఞానలోపం కలిగించే భక్తి నా కక్కరలేదు. స్పృహతప్పి పడిపోయే భక్తి మద ధారలు నేను కోరడం లేదు. ఓ నాధా! నాకు ప్రశాంత భక్తిని, ఆనందాన్ని ప్రసరింపజేసే స్నిగ్ధామృత - కలశాన్ని ప్రసాదించు. ప్రపంచ భవనద్వారాన్ని అది అలంకరించాలి. శాంతరస భక్తిని - ప్రేమను ప్రదానంచేయి. అదేనాకు కష్టదినాల్లో శుభం చేకూర్చుతుంది. అదే నాకు సుఖసమ యాల్లో దాసహీనదీప్తిని ప్రసాదిస్తుంది. అదేనాకు భావనా వేశంతో ప్రవహించే అశ్రువుల్ని అటకాయించి చిత్తాన్ని అనంతగంభీరాలతో పూర్ణం చేస్తుంది. ఈ భావాన్ని ఈ విధంగా గానంచేశాడు.

'చావో భక్తి శాంతిరస,
స్నిగ్ధ సుధా పూర్ణకరి
మంగళ కలశసంసార-భవన ద్వారే,
ఏ భక్తి అమృత
సమస్త జీవన హారోరహాయి బెవి స్మృతి
నిగూఢ గభీర
సర్వ కర్మేది బేబల

వ్యర్థశుభ చేష్టారే
ఓకరి జౌసఫల ఆనందే కళ్యాణ్
సర్వ ప్రేమే దిబెతృప్తి
సర్వ దుఃఖే దిబేక్షేమ
సర్వ సుఖే దీప్తి దాహహీన
సంబరియా భావ-అశ్రునార
చిత్తరబే పరిపూర్ణ అమత్త గ శ్రీర్.

రవీంద్రునకు పూర్ణానందం కావాలి. మృత్యువనే గోడదాటితేగాని అది లభించదు. అందుకని మృత్యువుని ప్రేమిస్తాడు. రవీంద్రునిది మృత్యుప్రేమ. దానికి సిరసివ్వాలి. సిరసిచ్చిన మీదటనే ప్రేమాలయానికి ప్రవేశం లభిస్తుం దంటాడు. ఆమార్గం ఎంతో అగమ్యం. అగాధం అయినా వదిలి పెట్టడు. ఆమార్గాన్ని ప్రేమానుభూతితోనూ-రసాను భూతితోనూ ముంచి ఎత్తుతాడు. ప్రేమానుభూతినే పరమ పురుషార్థంగా భావించి ఆత్మార్పణం చేసుకొంటూ ఆత్మపీడ నతో అనంత మార్గానికే పయనమిస్తాడు.

రవీంద్రుడు, కాళిదాసులాంటి రసవాది, కవి కనుక చిరంతన ఆనందాన్నే లక్ష్యంచేశాడు. రవీంద్రుని ఆనందా నికి వ్యాపక భావమూ ఉంది; ఆధ్యాత్మిక అర్థమూఉంది. చైతన్య సహాయంతో 'బ్లిష్' అనే చిరంతన ఆనందం పొందుతాడు. 'గీతాంజలి' చరణాలన్నీ చిరంతన ఆనం దంతో పాడుకున్న మహాభక్తుని సంకీర్తనలు. *

# రవీంద్రుని కవితలోని ఆధ్యాత్మిక ప్రణయం

రవీంద్రుని కవిత్వంలో ప్రణయకలాపం ప్రబంధ కావ్యాలు ప్రసాదించే కామోద్రేకంగాని - కామ తృప్తి గాని ఎంతమాత్రం ప్రదర్శించడంలేదు. నాయికాభేదాలు - నఖశిఖ వర్ణనలుచేసి శృంగార కవినవుదామని తానెన్నడూ వాంఛించలేదు. పైగా మహాకావ్యంగాని - ప్రబంధకావ్యం గాని వ్రాయడం ఆయన అభిమతం కానేకాదట. అసలు ఆయనలో క్లాసికల్ టెంపరమెంటు లేదనే చెప్పవచ్చు. ఉన్నదంతా రోమాంటిసిజం - దాంతోపాటు అభివ్యక్తీకరణ శిల్పం. రోమాంటిసిజం ఆంగ్లసాహిత్యంలో పందొమ్మిది-ఇరవయ్యో శతాబ్దాల ప్రధానకవిత్వంగా వికసించి దేశదేశాలు గుబాళించింది. ఉన్ముక్తధార - ఉదారస్వభావంతో జీవితం ప్రారంభించి రవీంద్రుడు కీట్సు-షెల్లీల రోమాంటిక్ కవిత్వానికి ప్రభావితుడై ఆయా కవుల నాయికల ఇంటలెక్చుఅల్ బ్యూటీకి ప్రతిరూపంగా తానూ 'ఊర్వశి' నొక నాయికను తీర్చిదిద్దాడు. కవీంద్రుని 'ఊర్వశి' నాయిక దేశదేశాలు తిరిగి మహాకవుల ప్రశంసాపత్రాలందుకుంది. జర్మన్ కవి గెథే 'Eternal woman' గా సర్టిఫైచేశాడు.

నందనవనవాసిని ఊర్వశి గృహలక్ష్మిగా కాక - సౌందర్య లక్ష్మిగా - విశ్వసుందరిగా ప్రతీతిచెందిన పౌరాణిక నర్తకి. రవీంద్రుని ఊర్వశిలాంటి మరొక భారతనాయిక జయదేవుని రాధ - జయదేవుడు గీతగోవిందలో రాధాకృష్ణుల్ని జీవ - పరమాత్మలకు ప్రతీకలుగా రూపొందించాడు. రాధ పరతత్వం - కృష్ణుడొక జీవుడుమాత్రం. కృష్ణరూపంలో జీవుడు రాధరూపంలోని పరతత్వానిని ఆసక్తుడై, క్షణంపాటు వియోగానికైనా తలూపక సదా తన్మయుడై రాధచుట్టూ గిరగిరా తిరుగుతుంటాడు మురళివొకటి వూదుకుంటూ. రాధ సౌందర్యలోకంలో విహరించే నందనవనవాసిని. కృష్ణుడు ఆ నందనవనంలో విహరించేగోపబాలుడు. రాధాకృష్ణుల ఈ గాధ రసానందంతొణికించే అమృతకలశం. జయదేవుని అనంతరం వైష్ణవకవుల చేతుల్లోపడి రాధాకృష్ణులు ఉల్టాసీదాలై కృష్ణుడు పరతత్వంగాను- రాధ జీవాత్మగానూ మారారు. వైష్ణవులకృష్ణకావ్యంప్రేమసౌందర్యాలకునిలయమై విశుద్ధమధురభక్తి ప్రాధాన్యంతోనాటినుండినేటవరకు మాసిపోని కవిత్వంగా-నిత్యకళ్యాణంగా భాసిల్లింది. అంతశ్చేతనను ఆత్మపరం చేసుకొని నవీన శిల్పంతో ఆధునిక భావకవిగా కలాన్ని వేణువుగా పూరించి జీవుని ఆవేదనను అభివ్యక్తం చేసిన కవీంద్ర రవీంద్రుడు ఏ వైష్ణవ కవికీ తీసిపోడు. వైష్ణవ కావ్యంలోని సంగీత తత్వం - భావైక్యం - కోమల స్వభావం - ప్రేమజీవనం, రవీంద్రుని కవిత్వంలోనూ మూర్తీభవించాయి. వైష్ణవ కవుల పంథాలో ఇష్టదైవాన్ని 'ఆనందమయుడు' గా పరిలేపించి 'దీనబంధూ' —'కరుణా

సింధూ'—'అమృతపథం నీవే' నంటూ కావ్య సుమనా లతో భక్తిశ్రద్ధలతో పూజించాడు. ఆ పూజాపుష్పాలే గీతాంజలి. వైష్ణవుల బాటనే ఇష్టదైవాన్ని 'తల్లి' 'తండ్రి' 'సమ్రాట్' 'ప్రభువు' ప్రియుడుగా భావించి సదా అను గ్రహం కోసం కృతజ్ఞుడై వేచియున్నాడు. రవీంద్రుడు వైష్ణవ కవుల అంతశ్చేతనను అనుకరించినా వైష్ణవ కవుల సాంప్ర దాయికత వేష-భాషలు-ధార్మిక అనుష్ఠానం యిత్యాదులకు దూరంగావుండి, విశ్వాత్మను—సర్వాత్మను ప్రతిరూపించే దర్శనాన్ని— ఆదర్శనాల్లోని నిరాకార బ్రహ్మానురాగియై సర్వత్రా స్థూలంలో సూక్ష్మాన్ని దర్శించి నిర్గుణ దార్శనిక కవిగా సర్వాత్మ గీతాలు పాడాడు.

రవీంద్రుడు కాళిదాసు లాంటి రసవాది కవి అయినా, ఉపనిషత్ పుత్రుడు—సర్వాత్మవాది కావడంతో రవీంద్రుని కవిత్వం మిస్టిసిజం—మర్మకవిత్వంగా విష్వారి బ్రహ్మాన్వేష ణలో ప్రకృతి నొక మాధ్యమం చేసుకొని మాధుర్య భావంతో లక్ష్యానికి చేరుకుంది. రవీంద్రుడు మర్మకవిత్వం ద్వారా ప్రకృతిసౌందర్యం వెనుక పొంచియున్న పరమా త్మతో తాదాత్మ్యం పొందేడు. ఈ తాదాత్మ్యం కోసం రవీంద్రుని జీవుడు పడిన ఆరాటం - విరహ వ్యాకులత— చేసిన అభిసారం అలౌకిక ప్రణయానుభూతిగా రూపొంది తురీయస్థితికి చేరుకొని ఆత్మానందం - బ్రహ్మానందం పొందాడు. నిరాకారమైన అధ్యాత్మను కావ్యంలో ప్రవేశ పెట్టి ఆత్మ-పరమాత్మల సంబంధాన్ని దాంపత్య భావంలో

అభివ్యక్తం చేసిన విధానాన్ని 'మర్మకవిత్వ'మని మన వాళ్ళు—'మిస్టిసిజము'ని పాశ్చాత్య సాహిత్య వ్యాఖ్యాతలు నామకరణం చేసేరు. ఆత్మగతమైన అధ్యాత్మను సాకారం చేయడానికి దార్శనిక కవులు-భావకవులు ప్రకృతి నొక సాధనంగా వాడుకున్నారు. ప్రకృతిమాత వీరికి ఉల్లాసం—ఉద్దీపం కలుగజేసింది. ప్రకృతిలోని మాంసల సౌందర్యానికి మురిసిపోక - ఇంకా ముందుకుపోయి ప్రకృతిలోని ఆంతరిక భావసౌందర్యాన్ని దర్శించి అతీతమైన మర్మానుభూతిని పొందుతుంటారు మిస్టిక్ కవులు.

రోమాంటిక్ కవిత్వంలో విశ్వవిఖ్యాతి నార్జించిన కీట్సు - శెల్లీల శ్రేణిలో రోమాంటిక్ కవిత్వం వ్రాసిన రవీంద్రుడు అదే రోమాంటిక్ కవిత్వంలోని మానవప్రేమ-ప్రకృతిప్రేమను పరమాత్మోన్ముఖం చేసిన మిస్టిక్ మహాకవి రవీంద్రుడు. వస్తువుతోపాటు శిల్పాన్ని—అనుభూతిని—(మర్మానుభూతి - ప్రణయకలాపం) యథాతథంగా నడిపించాడు. రవీంద్రుడు కవిత్వంలో ప్రేమానుభూతి - స్వచ్ఛంద భావావేశం అభివ్యక్తం చెయ్యడంలో చూపిన సాహసం కీట్సు-శెల్లీల వ్యక్తిత్వానికి ఎంతమాత్రం తీసిపోదు. రవీంద్రుని కవితలోని ప్రకృతి పరమాత్మను సూచించే ఒక సంకేతం. ప్రకృతి ఆధ్యాత్మిక సౌందర్యానికి ప్రతీకగా రూపక - ఉపమాలంకారాలతో కావ్యమంతటా అల్లుకుపోయి పరిమితాత్మను అపరిమితాత్మతో తాదాత్మ్యం చేయించి ఆనందోల్లాసాల్లో ముంచి ఎత్తుతుంది. రవీంద్రుడుస్వాత్మకుపరిచయం

చెయ్యడంలో యితరకవుల మాదిరిగా ఆత్మసంకోచంగాని ఆత్మ గోపనంగాని రానివ్వలేదు. సర్వత్రా ఆత్మార్పణ - ఆత్మనివేదనం చేసుకుంటూ సాగేడు పైగా తా స్వయంగా చిత్రకారుడు కావడంతో ఆత్మనిష్ఠ భావాలకు చక్కని ఆకారాలు - మూర్తరూపాలు యిచ్చుకున్నాడు. ఇంకా తన అమృతగాత్రంతో తాళ-లయ యుక్తంగా పశ్చిమ సంగీతంతో పాడుకోవడంతో ఆయన ప్రగీతాల్లో సహజ మాధుర్యం వచ్చేసింది. హృదిలోని తీవ్రానుభూతి- ప్రణయావేదన గేయంలో వ్యక్తం అయినంతగా గద్య - పద్యాల్లో అభివ్యక్తం కాలేవు. భావాతిరేకత - ఆర్ద్రత - తన్మయత - విహ్వలత, వీటిని అభివ్యక్తం చెయ్యడంలో గేయానిదే ప్రథమస్థానం. గేయంలో వచ్చిన స్వాభావికత - కళాసౌందర్యం పద్యంలో రాలేవు ముక్తాత్మను గానం చెయ్యడానికి ప్రగీతిశైలికి మించిన మరొక ఉపయుక్తమైన మార్గం ఇంతవరకూ కానరాదు. అందుకే కాబోలు భావకవులందరూ అంతటా ప్రగీతశైలినే చేపట్టారు

మానవప్రేమైనా - భగవత్ప్రేమైనా కవీంద్రుని దృష్టిలో అంత సులువైందీ కాదు - అంత మృదువైందీ కాదు. 'ప్రేమ ఎంత గొప్పగా వుంటుందో - దాని విలువ కూడా అంత ఎక్కువగా ఉంటుంది. ప్రేమంటే పూలపాన్పు కాదు - అది ముళ్ళపాన్పు భగవద్భక్తి పదునైన కత్తిపోటు లాంటిది. అగ్నికున్న ఉష్ణం-వజ్రానికున్న కఠినత్వం భగవద్భక్తిలో ఉన్నాయని 'బేయా' కవితలో వ్యాఖ్యానించాడు.

రవీంద్రుని జీవుడు మహాభక్తుడు. కావ్యరంగంలో

ఆ భక్తుడు ప్రియురాలి వేషం నటిస్తాడు. రవీంద్రుని ఆత్మను పరమాత్మాన్వేషణలో ప్రియురాలుగానే వ్యాసాంతంవరకూ చూపెడుతాను. ఈ ప్రియురాలు ఆధ్యాత్మిక ప్రియురాలు. ఈ ప్రియురాలు ప్రియుణ్ణి (పరమాత్మ) కళ్ళతో చూడలేదు. ప్రత్యక్షంగా చూడాలని వాంఛించలేదు–తెరచాటునే ఉండి ఆనందం పొందుతుంది. అదే ఆమెకు ఇష్టం. ప్రియురాలు ప్రియుణ్ణి 'స్వప్నం' లో కలుసుకుంటుంది. స్వప్నసుఖమే ఆమెకు మహదానందం అయింది– దాన్నే పదివేల బహుమానంగా భావించింది. ప్రియుడు మొదటిరాత్రి సమాగమనంలో ఖడ్గమొకటి పాన్పుపై వదలిపోతాడు. ప్రియురాలు భావుకతావేశంలో ఖడ్గాన్ని పూలగుచ్ఛ మనుకుంటుంది. తెల్లవారి నిద్రలేచి తాపీగా చూచుకోగా అది పదునైనకత్తి. కత్తిచూచి కంగారుపడింది. కత్తిని ప్రసాదించిన నిర్దయ ప్రియుని ప్రియురాలు ప్రశ్నిస్తుంది – ఓ ప్రియా! రాత్రి నీవు పక్కమీద వదలిపోయింది ఖడ్గమా! కత్తులపాన్పా నీవు ప్రసాదించేది! పూలగుచ్ఛమని భ్రమపడ్డానే, ఏమిటిది! పూలకు బదులుగా ఖడ్గమా నీవు ప్రసాదించింది! ఇది నాకు (స్త్రీకి) అందం ఇస్తుందా! పూలమాలా కాదు – సుగంధ జలమా కాదు – అరే, ఇది భయంకరఖడ్గం! అబలకా ఖడ్గం ప్రసాదించేది! దీన్నే ప్రేమోపహారం అనుకోమన్నావా! అయితే దీన్నెక్కడ దాచిపెట్టేది? ఆఁ– వక్షస్థలంలోనే దాచిపెడతాను నీవు ఏదిప్రసాదించినా వక్షస్థలంలోనే దాస్తాను. కత్తిపోటుకు వక్షం తరిగి తరిగి కరిగిపోతుంది – అయినా నా కది వరప్రసాదమే. ఆఁ– ఇప్పుడు

అర్థమయ్యావు నీవు. నీవు ప్రేమించేవాళ్ళకు కత్తులపాన్పే ప్రసాదిస్తావు, అని ఈ భావాన్ని క్రింది గేయంలో పాడుకున్నాడు.

తాయితో ఆమిభావి బసే
నకితో మారదాన్?
కోధాయ్ యేకే లుకియేరాఖ
నాయి యేహేనస్థాన
ఓ గో యేకితో మారదాణ?
శక్తిహీన మరిలాజె
ఏ భూషణకి అమారసాజె?
రాఖ తెగేలే బుకేరమఝే
వ్యధా యేపాయ ప్రాణ
తబు ఆజి బయిబబుకే
ఏయి వేదనారీ మాన
నియోతో మారఎయిదాన?

రవీంద్రుని ఆధ్యాత్మిక ప్రేయసి ప్రియుణ్ణి పరిచయం చేస్తూ అంటుంది– 'నా ప్రియుడు విషాదరాత్రికి రారాజు. అంధకార భవనానికి పాదుషా. ఆయనకు సుఖ సౌఖ్యాలు అయిష్టం. ప్రియురాలి విరహమే ఆయనకు ఆనందం. ఆయన ఆనందమే నాకు ఆనందం. ఆయన్నిబట్టి దుఃఖప్రపంచం నాకూ యిష్టమైంది. ఆయన ప్రసాదించే బాధాప్రపంచం లోనే తిరుగుతుంటాను. ఎప్పుడొచ్చినా పురుములు – మెరుపుల్తో కూడిన తుఫాను వెంటేసుకొని వస్తుంటాడు. ఆతుఫాను

స్థితిలోనే సరసన కూర్చుంటాడు. ఆయన మార్గమే ముళ్ళ మార్గం—దుఃఖమార్గం. ప్రియుడు ప్రదర్శించే ఈ క్లేశమహిమను అర్థంచేసుకోనివాళ్ళు నిజంగా పిచ్చివాళ్ళు. ఎవరక్కడ ద్వారంవద్ద? తెరవండి నలుద్వారాలు - తొందరగా తెరువండి - ఏ మార్గం నుండైనా రావచ్చు మంగళవాయిద్యాలతో - శంఖనాదాలతో దిగ్దిగంతాలు మారుమోగించండి - ఇదే ఆయనకు స్వాగతపత్రం. అదిగో, రానేవచ్చేశాడు నా రేరాజు - నా కాళరాజు గంపెడు చీకటి నెత్తినేసుకొని రానేవచ్చేశాడు. ఏదీ నా జీర్ణవస్త్రం? పరచండి - కూర్చుంటాడు; ఈ పై భావాన్ని ఈ క్రింది గేయంలో ముక్తగానం చేసేరు—

ఓరే దుయార్ ఖోలెదెరె -
బాజా శంఖ బాజా
గంభీరరాతే ఏసేఛే ఆజ్
ఆంధార ఘరేర రాజా
వజ్ర డాకె శూన్యతలె
విద్యుతేరె ఝిలిక ఝులె
ఛిన్న శయన ఆనె యేనే
ఆంగి నాతోర సాజా
ఝడేర సాథే హఠాత్ యేలో
దుఃఖ - రాతేర రాజా

9)

ఈవిధంగా 'బేయా' 'నైవేద్య' గేయాల్లో, విషాదం విలువ తెలిసిన రవీంద్రుడు మధుర వేదనలోనే పరమాత్మను చూడడానికి తహతహ లాడేడు. సుఖంలోకాకపోతే-దుఃఖంలోనైనా, ఏదోరకంగా పరమాత్మను చూస్తాను అంటాడు రవీంద్రుడు తన ఆధ్యాత్మిక ప్రియుణ్ణి 'సుందర్' అని సంబోధించాడు రవీంద్రుని 'సుందర్' అందగాడు. ప్రియుడు పెట్టే బాధలన్నీ రవీంద్రుని ప్రేయసి సహిస్తూనే వస్తూంది. ప్రియుడు నిర్దయుడు - పాషాణహృదయుడు. అతనికి సుఖపురాత్రిలు నచ్చవు ప్రియురాల్ని బాధపెట్టడంలోనే అతని కానందం. కనుక ఆ బాధా ప్రపంచంలోనే ప్రియుణ్ణి చూడాలని నిశ్చయించుకొని శ్రావణ భాద్రపద మాసాల అంధకారపు అర్ధరాత్రివేళల ఇంటి నలుద్వారాలు తెరచివుంచుతుంది, ప్రియుడు ఏమార్గం నుండైనా - ఏవైపు నుండైనా రావచ్చుననే ఆశతో. రవీంద్రునిప్రేయసి ప్రియుని కోసం ఇల్లువదలి పోదు ప్రియునియింటికి - అత్తవారింటికి ఎన్నడూ వెళ్ళదు. రాజసంగల రవీంద్రుడు ప్రియురాల్ని ఇల్లు కదలనివ్వడు: ప్రియుణ్ణే ప్రియురాలు ఇంటికి రప్పించుకుంటుంది. ప్రియురాలి అలక ప్రియుణ్ణే భువికి దించుకుంటుంది.

ప్రియుని బాణాలు, కత్తిపోటులు ప్రేయసి గుండెను ఎంత ఛేదిస్తున్నా మధురాతి మధురంగా సహించుకుంటూ వస్తుంది. ప్రియుని బాణాలు - కత్తిపోట్లు తగులనంతవరకు ప్రేయసి పరిచయమే కాజాలది ప్రియురాలి విశ్వాసం. కత్తి

పోట్లు తగిలినకొద్దీ బాధ మధురాతి మధురంగా రూపొందుతుందట. ప్రియుణ్ణి మరీమరీ ప్రార్థిస్తుంది- ఓ ప్రియా! కత్తితో మరోపోటు వెయ్యి ఈ హృదయ దేశాన్ని కత్తితో త్రవ్వి ఎత్తు. అదేనాకు జీవనాధారం. అదేనాకు మనశ్శాంతి,ఆత్మానందం. ప్రియుడు బాధపెడుతున్నకొద్దీ దగ్గర పడుతున్నాడని- తానూ మధురంగా సహించడంద్వారా ప్రియుణ్ణి సమీపిస్తున్నానని ప్రియురాలు భావిస్తుంది. ప్రియుడు సైతం ప్రియురాలి కోసం అభిసారం చెయ్యడం—ప్రేయసితో ప్రేమ కేళికోసం తహతహలాడడం - వ్యాకులత చెందడం లాంటి తుల్యానురాగాన్ని రవీంద్రుడు అనేక గీతాల్లో వ్యక్తం చేశాడు. రవీంద్రుడు తన ఆరాధ్యుణ్ణి తన కడకే రప్పించుకొనే భావం ఆయన (రవీంద్రుడు) జీవితంలో అనేక మార్పులు తెచ్చింది. ఆత్మాభిమానం - ఆత్మవిశ్వాసం రెండూ ప్రధానమైన భావాలు. రవీంద్రుని ప్రణయంలో ప్రియుడు అలసివచ్చిన బాటసారి. ప్రియుణ్ణి స్వగృహానికి రప్పించుకొనడమనే భావం భారతీయ సాహిత్యానిది కాదు ఆంగ్లసాహిత్యంలోనూ - సూఫీ సాహిత్యంలోనూ వున్న తుల్యానురాగ భావాన్ని రవీంద్రుడు ఈదేశ సాహిత్యంలో ప్రవేశపెట్టాడు.

ఎట్టకేలకు ప్రియుడు ప్రియురాలి ఇంటికి "ప్రేయసి ఎక్కడ? ప్రియురాలు ఏదీ" అని పిలుస్తూ ఇంటిచుట్టూ తిరుగుతాడు- ఎవరికోసమైతే ఎదురుచూస్తున్నావో, వెతుకుతున్నావో, అతను 'నేనే అతను 'నేనే'నని పిలచిపిలచితిరిగిపోతాడు. ప్రియురాలు సిగ్గుతో మాట్లాడలేదు - కన్నెత్తి చూడలేదు. మరొక

లెక్కడ, ప్రియురాలెక్కడ' అని. ఎలా చెప్పేది-'ఓ బాట సారీ ప్రేయసిని నేనే, ప్రియురాల్ని నేనే' నని? నేనో ఒక వైపు సిగ్గుతో తలవంచుకు పోతున్నాను;

ఫాల్గుణమాసపు రాత్రిసమయం అది. ఇంట్లో దీపం వెలుగుతూనేవుంది దక్షిణపవనం నాకేసి జోరుగా వీస్తూనే వుంది. పవనం నా ఛాతీని భేదిస్తూ వీస్తూనే వుంది. సారిక స్వర్ణపంజరంలో నిద్రిస్తూనే వుంది ద్వారపాలకుడు ద్వారం కడ గురకలు కొడుతూనే వున్నాడు. నా శయన మందిరం ధూప-దీపాలతో కళకళలాడుతోంది. సుగంధాలతో నా శరీరం బరువెక్కి శిథిలమైపోయింది. నేను నెమలిపింఛాల వడ్డాణం ధరించి బాగా సింగారించుకొని రాజమార్గంవైపుకు తదేక ధ్యానంతో విచారంగా పాడుకుంటూ తెల్లవారు ఝాముదాకా వుండిపోయాను. చివరకు నిరాకారంగా చెప్పిపోయాడు - 'ప్రేయసి రూపంలో పాడుకుంటూ కూర్చున్నది నేనే. ప్రేయసి రూపంలో పాడింది నేనే' నని.

రవీంద్రుడు ప్రాతఃకాలీన తరుణ ప్రకాశంలో ఆధ్యాత్మిక సౌందర్యం చూశాడు. ఉదయపు తరుణ ప్రకాశం ప్రియురాలి (తన) పక్కమీద పడుతున్న విధానాన్ని— తీక్షణమైన ఉషఃకిరణ బాణాలే గుండెను ఛేదించి గుండెలో ప్రవేశిస్తున్నవి. దీన్నే తియ్యని బాధగా భావించి పదేపదే ఉషఃకిరణ బాణాలతో గుండెను ఛేదించమని ప్రియుణ్ణి (పరమాత్మ) అభ్యర్థిస్తాడు. స్వాత్మను అధ్యాత్మ ప్రణయంలో వధువు-విరహిణి - ప్రోషితపతిక - ఆగతపతికగా

పతీకల బాహుళ్యంతో అభివర్ణించుకున్నాడు రవీంద్రుని దైవం సీమారహితమైన దేశంలో నివసిస్తాడు. ఆ దేశాన్ని 'సబ్ పే యేఖిర దేశ్' అని, అపరిమితంగా ప్రేమించాడు అంతేకాదు, ఆ దేశానికి ప్రశాంతంగా అధ్యాత్మికయాత్ర చేస్తాడు. ఆ దేశంలో ప్రవేశించి బసవుదించుకొని అలుపు సొలుపు తీర్చుకుంటాడు. ఆ తరువాత వీణొకటి చేతబట్టుకొని స్వరసంధానం చెయ్యాలనుకున్నాడు. మరి స్తవనవేళా సమీపించింది! ఆ రాత్రి అక్కడనే మకాం చెయ్యాలి. నక్షత్రాల సరసన రేయిబడిలో నిశ్చింతగా కవి విశ్రాంతి తీసుకోవాలి. ఈ భావాన్ని కవి పాడుకున్నాడు—

పాఖాడిమొ బసరే. హేథాయసారా దినేర శేషే
తారార్ భరా ఆకాశతలె సబ్ పేయేభర దేశ్.

రవీంద్రుడు అహం త్యజించే ఈ పరమాత్మ దేశానికి రాగలిగాడు. అహం వదులుకుంటేగాని ఆంతరిక ప్రేమ సాధ్యంకాదట. అప్పుడుగాని అమితానందానుభూతి పొంది పరమాత్మలో ఐక్యం కాలేమని మార్మికంగా వ్యక్తం చేస్తాడు. రవీంద్రుని ప్రణయం స్వయంప్రాప్తమై భావనాత్మకంగా కొనసాగింది. ప్రియునిమీద అమితవిశ్వాసం – అంధ విశ్వాసం పెట్టుకొని ఆత్మసమర్పణ చేసుకుంటూ శరవేగంతో, అత్యద్భుతాలతో గమనంచేసి అపూర్వ జ్యోతుల్ని వెదజల్లింది.

అధ్యాత్మంలో రవీంద్రుడు సదా సుదూరంనుండి సన్నని మధుర మురళీధ్వని విని ముగ్ధుడై వికలుడౌతాడు.

మధుర మురళీధ్వని మాత్రమే విన్నాడు - ఆ మురళీధరుని రూపం మాత్రం చూడలేదు. రవీంద్రునకు రూపంతో పనిలేదు. ఆరాధ్యుని తియ్యనిగానంతోనే సంబంధం. అదే ఆయన కానందం. ఆ మురళీధరుడు కనిపించకుండా ఎన్నో బాధలు పెడతాడు ఆ బాధల్లోనే బ్రహ్మమెరుస్తూ వుంటాడని వాటినేనమ్మి వరదానంగా స్వీకరిస్తాడు. ఆ బాధలు కవీంద్రుని కెంతో భావసౌందర్యం ప్రసాదించి విరహావిహ్వలత ద్వారా ఆయన్ని సజీవుని - చిరంజీవిని గావించాయి. అందుకే కాబోలు అధ్యాత్మంతో ప్రణయసంచార అభిసారాలు జిజ్ఞాసతో ముగిస్తాడు. అభిసారంలోవున్న ఆనందం దర్శనప్రాప్తిలో లేదంటాడు తాను దైవాన్ని కన్నెత్తి చూడకుండానే ఎప్పటికప్పుడు బ్రహ్మానందం పొందాడు. ప్రత్యక్ష దర్శనానంతరం ఇక మిగిలేదిలేదని రూపదర్శనం కాక - భావసందర్శనంకోసం సదా చింతాక్రాంతుడై వుండేవాడు. ఆయన చింతాక్రాంత స్వభావం ఆధ్యాత్మిక అభిసారంగా అ'మిచ్చింది.

పరమాత్మ అతి దూరదేశవాసిగనుక ఆయనంటే ఒక ఆకర్షణ - అభీప్స-విరహావ్యాకులత కలగడం సహజం అంటాడు ఆంగ్లకవి శెల్లీ. Sky Lark కూడా దూరపు దైవం ప్రేమను - దాహాన్ని పెంచుతుంది. స్కైలార్కు కోసం శెల్లీ చేసిన అన్వేషణ - పడినపాట్లు తానూ తన 'సుందర్' కోసం చేశాడు. కవీంద్రుడు మరొకచోట ఆరాధ్యుణ్ణి పల్లె

కారిగా వర్ణించి అర్థిస్తాడు. నా జీవన నౌకను నడిపే పల్లె కారీ ! ఇంతవరకు నీ దర్శనం కాలేదు. దర్శనభాగ్యం ఎప్పుడు లభిస్తుంది? నా నౌకను నీశాంతిసాగరానికి తోడ్కొనిపో. నీ విరాట విశ్వంతో నన్ను ఐక్యం చేసుకో. మరో చోట ఆవలి వొడ్డునుండి నావ నెట్టుకుంటూ పాడుకుంటూ వస్తున్న రూపంలో దగ్గరపడుతున్న 'సుందర్'ని చూచి అయ్యో, ఈయన్ని నేనెరుగుదునే, అని (సోనార్ తరి)'స్వర్ణ నౌక' కవితలో ఆశ్చర్యాన్ని, ఎరుకను వెలిబుచ్చుతాడు. మానవుడు ఈశ్వర అంశం అయివుండి ఆయనకు చిరపరిచితుడే నని, తాను ఆయన సంతతియేనని రవీంద్రుని విశ్వాసం. మానవుడు ఈశ్వరుడుమాత్రం కాడు . 'ఈశ్వర అంశం' అని దృఢంగా వ్యక్తపరచాడు. రవీంద్రుడు అధ్యాత్మంలో క్లాంత యాత్రికుడు - సిద్ధికోసం తహతహలాడేడు- ఆర్తుడు-దైవవాణి కోసం పరితపించేడు. దైవ ప్రాప్తికోసం-సాన్నిధ్యం కోసం విరహవేదనలతో యుద్ధం చేశాడు.

రవీంద్రుడు బాహ్యజగత్తులోనే సూక్ష్మాతి సూక్ష్మమైన అంతర్ జగత్తొకటి దర్శించిన కారణంగా ఆయన భావాల్లో ఒక భారీ సంవేదన - సాధన - ఆవేదన - ఆరాధనలు ప్రస్ఫుటించాయి. సాహిత్యం ద్వారా ఇష్టదేవతను ఆరాధించడమనేది సామాన్యకవికి సాధ్యమయ్యేది కాదు. తత్వవేత్త అయిన కవికే అది సాధ్యం. సాహిత్యం-కవిత్వం కూడా ఆధ్యాత్మిక సాధనాలేనని చెపుతూ స్వప్రాసం -

విరహంలోనూ జీవనసార్థకత వున్నదంటాడు. అందుకనే దుఃఖాన్ని ప్రేమిస్తాడు - మధురంగా భావిస్తాడు. విరహం లోనే ఆధ్యాత్మిక ప్రణయసంకేతనం - మధుర బాంధవ్యం- అలౌకికానందం - అమాంసల సౌందర్యంల అనుభూతుల్ని అభివ్యక్తం చేశాడు. సర్వత్రా వ్యాపించియున్న సత్యాన్ని కవిత్వంలో వ్యక్తపరచాడు. సార్వజనీన సత్యాన్ని సాకారం చెయ్యడంలో సంకుచితాన్నిగాని - సాంప్రదాయికతనుగానీ రానీయక, సర్వజనా మోదమైన విశ్వజనీనతను - విశ్వ విశాలతను ప్రవేశపెట్టాడు. అధ్యాత్మ జ్ఞానాన్నే చరమ లక్ష్యంగా భావించి అద్వైతమార్గాన మిష్టిసిజం లాంటి ప్రేమకవిత్వంతో పరతత్వానికి ఎంతో మహత్తును ప్రతిపా దించి తడిహృదయంతో సంకీర్తనలు పాడి బ్రహ్మతేజ స్సుతో దోబూచులాడిన మహాభక్తుడు రవీంద్రుడు. బెల్లం తిన్న మూగవాని చందాన ఆనందాభివ్యక్తీకరణను అస్ప ష్టంగావుంచి కావ్యశిల్పంతో మాధుర్యం తెచ్చాడు. కవి స్వయంగా గాయకుడు కావడంలో కళను-కవిత్వాన్ని కలిపి చూడగల సమర్థత రవీంద్రుని కబ్బింది. In art man reveals him self అని కళకొక ప్రత్యేక అస్తిత్వాన్ని అంగీకరించి భావజగత్తుద్వారా కవిత్వంలో లలితకళల్ని పోషించాడు. ఆయన చిత్రాలు ఆయన కవిత్వాలకు మూర్తరూపాలు. జీవన సౌందర్యానికి గద్యం ఎన్నుకుంటే ఆధ్యాత్మిక సౌంద ర్యానికి కవిత్వం ఎన్నుకున్నాడు. కవిత్వానికి సంగీతంతో ముడిపెట్టి సంగీతంలోనూ అద్భుతమైన సృష్టిరహస్యం కని పెట్టాడు. కవిత్వంతోపాటు సంగీతంలోనూ ఆనంద - ఐక్య

భావాల్ని చూపెట్టాడు. సంగీతం కూడా ఒక శాశ్వత సత్యమేనట. తానూ సంగీతానికి క్రొత్త క్రొత్త స్వరాలు పశ్చిమ-ప్రాచ్య సంగీతాల సమ్మేళనంతో తయారుచేశాడు. ప్రతిగేయం - కవిత్వం ముందుపాడుకొని చూసేవాడు. భావ కవులందరూ దాదాపు గాయకులే దేవులపల్లి కృష్ణశాస్త్రి ముందు పాడుకోందే - ఆర్చెస్ట్రా లేకుండా గీతం వ్రాయరట. కవిత్వం సంగీతప్రధానం అయ్యేటప్పటి గేయాల్లో దురన్వయంగాని - యాంత్రికతగాని రావడానికి అవకాశం లేదు. అర్థంలోనూ - శబ్దంలోనూ ఒకే మైత్రి వచ్చేస్తుంది. పదంపదంలోనూ ఋజుప్రసార గుణాలు ప్రత్యక్షమౌతాయి. కవీంద్రుని చేతిలో గీతికావ్యం పూర్ణంగా పుష్పించిందనడంలో అతిశయోక్తి లేదు. వాస్తవానికి రవీంద్రుడు ఉద్యానవనంలాంటి కవిత్వం ప్రదానం చేశాడు. ఆయన కవిత్వాన్ని స్తుతిస్తూ ఎవరోగాని 'భావకవిత్వానికి గీతాంజలి బైబుల్‌లాంటిద'ని పేర్కొన్నారు. ఆధ్యాత్మిక ఉదాగస్వభావం గల కవి గనుక కవిత్వంలోనూ కారుణ్య భావం అడుగడుగునా తొంగిచూసింది. అధ్యాత్మవాదులకు సృష్టంతా కరుణాజనితమే గదా.

# రవీంద్రుని గద్య రచనలు

## కథలు

రవీంద్రుడు వొక్క కవీంద్రుడుగానే కాక కథకుడు-నాటక రచయిత - వ్యాస రచయిత - చిత్రకారుడు - నటుడుగా కూడా సాహిత్య నాటికలో పంచరంగులపుష్పాలు పూయించాడు.

గీతాంజలి దాటి కథల్లో ప్రవేశించినా కథల్లోనూ కవి ధర్మాన్ని పసిగట్టగలం. వొక్కొక్క గీతాన్ని ఎంత బిగువుగా వ్రాశాడో -కథనూ అంత పుష్టికరంగా బిగించాడు నిజం మాట్లాడాలంటే బెంగాలి భాషలో చిన్న కథను తొలిగా వ్రాసింది రవీంద్రుడు

బంకించంద్రుడు అప్పటికే కథారంగంలో సంచరిస్తున్నా అంతర్దృష్టి, అంతర్ద్వంద్వాలను సూక్ష్మాతిసూక్ష్మంగా వసుపరం చేసుకొని పారివారిక - సామాజిక వాతావరణంతో లఘుకాయంలో అమర్చిన కథాశిల్పి రవీంద్రుడే. దేశభక్తి పూరితం కావడంతో బంకిం చంద్రుని కథావస్తువు విశాలకాయంలో బయల్వెడలి చిన్న నవల అనిపించుకొన్నది. మనసునుపట్టే ఏదోవొక అనుభూతి - ఉద్వేగం కాలాతీతంగా బయలుదేరి కథావస్తువు కాలేక పోయింది బంకిం చంద్రుని కథాసాహిత్యం. కాలసాపేక్ష్య

వస్తువైన దేశభక్తితో ప్రాణం పోసుకుని బంకిం చంద్రుని కథలు ఆయా సమయాలకు సీమితమై పోయాయి.

రవీంద్రుని కవిహృదయం లోకంలోని దుఃఖ దైన్యాలు, కరుణాక్రందనాలు, ఆనందోల్లాసాలు హేలీ కొట్టుకొని లోకంలోని ఈతిబాధలు వింటానికి సిద్ధపడింది. కవి హృదయంలోని ఆ భావ విహ్వాలతే కథల్లోనూ అనుప్రాణితమై మరో రూపంలో యుగానికి విరుద్ధంగా కంప్లైంట్‌గా హెచ్చరికలు చేస్తూ నిలబడింది.

అతి సాధారణమైన గ్రామీణుల్ని తీసుకొని సమవేదనా గాహంలో ఆయా పాత్రలకు సహృదృష్టిని ప్రసాదించాడు రవీంద్రుడు. రవీంద్రుని కథల్లో నదిఒడ్డున కూర్చొని బుట్టలల్లుకొనే చేతిపనివాళ్లు మొదలుకొని, నది రేవుల్లో నగ్న శరీరంతో స్నానం చేస్తున్న గ్రామీణ యువతులు సైతం ఎదురౌతారు. రవీంద్రుని కవితకు—కథకూ వాకేరకమైన గ్రామీణ జీవితం ఆధారపడింది కథల్లో మరో రకమైన పట్టణజీవితం కూడా చోటు చేసుకుంది. నౌకలన్నా, నౌకా విహారం అన్నా, రవీంద్రునికి మక్కువ. ఆయన ప్రారంభిక జీవితం తూర్పుబెంగాలులోని వాక నదిఒడ్డున గడిచింది. నిత్యం నౌకాదృశ్యాలు చూశాడు

రవీంద్రుడు 'పోష్టుమాష్టరు' కథలో వాకానొక స్నేహాలోలుప, నిస్సహాయ గ్రామీణబాలిక కరుణామయ జీవితాన్ని చిత్రించాడు. బాలిక యొక్క స్నేహాకాంక్షిత

హృదయం స్నేహ విచ్యుతి ఆశంకతో గబగబా వణికి పోతుంది.

తన బంధుజనావళికి దూరంగా, వొక నిర్జన గ్రామంలో, వో దరిద్రుడైన పోస్టుమాష్టరు తన వొంటరి జీవితంలో వివిధ మనోరథాలను సాలెగూడులా అల్లుకుంటాడు. తనకు దూరంగా వున్న న కుటుంబాన్ని స్మరించుకుంటాడు. తాను యిల్లు బయలుదేరి వస్తున్న సమయాన బిడ్డ రతన్ (బాలిక) పరుగెత్తుకుంటూ ఎదురైంది. ఆ దృశ్యాన్ని తాను మరువలేకున్నాడు. రవీంద్రుని మమతా హృదయం పోస్టుమాష్టరు రూపంలో వ్యక్తం అయింది.

'పోస్టుమాష్టరు' బిడ్డను వదలి నౌకనెక్కి నది దాటుతున్నప్పుడు వర్షంలో ఉప్పొంగుతున్న నదీప్రవాహాన్ని పోస్టుమాస్టరు విహ్వలహృదయం వేదనాతరంగాలు లేపుతున్నట్టుగా రవీంద్రుడు అభివర్ణిస్తాడు. రెండోవైపు తండ్రిని వదలిపెట్టలేక వదలిపెడుతున్న బిడ్డ ముఖారవిందాన్ని విశ్వవేదనతో నింపేసి హృదయవిదారకంగా చిత్రిస్తాడు. బిడ్డకడకు తిరిగిరావాలనుకున్నా నౌకా అభ్యంతరంగా రాలేక పోతున్న తండ్రి వ్యథ, వియోగ విచ్ఛేదాలు వొక్క రవీంద్రుని కలానికే అంతుపట్టాయి.

ఇలాంటి విచ్ఛేదిత వ్యథిత ప్రాణుల ఆర్తనాదాలను 'కాబూలీవాలా' 'మహామాయ' 'వొకరాత్రి' వంటి కథల్లోనూ సంవేద్యంగా అభివర్ణించాడు. వొక్కొక్క దుఃఖాంత కథ, వొక్కొక్క భావగీతంలా స్రవించింది. ఇలాంటి భావ

ప్రధాన కథలు రవీంద్రుని చేతిలో పూర్ణంగా ప్రాణం పోసు కొని కాలాతీత పరిధుల్లో నేటికీ సజీవంగా నిలచాయి. స్నేహ బంధనాన్ని-విచ్ఛేద క్రందనాన్ని వొక్క రవీంద్రుడే సఫలీ కృతంగా అభివ్యక్తం చెయ్యగలిగాడు. మారుమూలవ్యక్తిని తీసుకొని అతనిమనోవ్యధను విశ్వవ్యాప్తం చెయ్యగలిగాడు. కాబూలివాలా (రహమత్) భారతదేశం వ్యాపారార్ధంవిచ్చేసి మీనీ అనే ఐదేళ్ళ బాలికతో తొలిచూపులోనే వాత్సల్య బంధంలో చిక్కుకుంటాడు. మీనీ అనర్గళంగా మాట్లాడు తున్న పసిడి మాటలకు ముగ్ధుడౌతూ మీనీ పసిడికాళ్ళవద్ద చతికిలబడతాడు. నిత్యం బాదం - కిస్‌మిస్‌లు అందిస్తుం టాడు. మీనీ తండ్రికది గిట్టదు యిద్దరినీ వేరుచేస్తాడు. మీనీ తండ్రి కాబూలివాలా కిచ్చిన కిస్‌మిస్‌పళ్ళ విలువ 'అర్ధ రూపాయి'ని తిరిగి కాబూలివాలా మీనీకి చాటుగా అంది స్తాడు.

వొకనాడు నీ సంచిలో ఏముందని అడుగుతుంది మీనీ కాబూలీవాలాను.

ఏనుగుందని పరిహాసం పలుకుతాడు కాబూలీవాలా. ఇలా పరిహాసాలతో వాళ్ళ వాత్సల్య బంధం చిక్కులు పడుతుంది.

మరోనాడు నవ్వుతూ అడుగుతాడు కాబూలివాలా ఎప్పుడు అత్తవారింటి కెళతావని.

నువ్వెప్పు డెళతావని ఎదురుప్రశ్న వేస్తుంది మీనీ. అతడునవ్వుతూ 'నేను అత్తను చంపేస్తాను'అంటాడు.

కథ మార్మికంగా సాగుతుంది వాత్సల్య రసంతో. రవీంద్రుడు వొక విదేశీయుడు, విధర్మ హృదయంలో నవనీతం లాంటి వాత్సల్య భావాలను ప్రతిష్ఠించాడు. కాబూలివాలా డబ్బు వసూలు చెయ్యడంలో కఠినాత్ముడు. వొక తన్ని పైకం విషయంలోనే కత్తితో పొడుస్తాడు. ప్రతిఫలంగా జైలు కెడతాడు. చేతి సంకెళ్ళతో మినీ యింటి గుమ్మం మీదుగా జైలు కెళడం చూచి మినీ పిలుస్తుంది "నీవు అత్తవారింటి కెళతావా" అని.

"ఔను, అక్కడికే వెళుతున్నా" నంటాడు. అతడు జైలుజీవితం ఏళ్ళ పర్యంతం గడపరావడం, యిటు మినీ పెరిగి పెద్దదిగా కావడం, పెండ్లిమహోత్సవం నాటికి కాబూలివాలా విడుదలై రావడం, మినీ కాబూలివాలాను విస్మరించడం, కాబూలివాలా విస్మరించలేకపోడం లాంటి వాతావరణాన్ని రవీంద్రుడు సంవేద్యంగా అభివర్ణించాడు. కాబూలివాలాలోని వాత్సల్యం గురుదేవుని వాత్సల్యం. ఆ వాత్సల్యానికి దేశభేదాలు, మతభేదాలు అడ్డురాలేదు.

కవి భావుక హృదయం తన జీవితంలోని విరహ—మేళవాల అనుభూతుల్ని దాచుకున్న విధానాలను అభివర్ణించాడు రవీంద్రుడు.

వొక్కొక్క కథ వొక్కొక్క భావకవిత్వంగా—గీతాంజలి గేయంగా విడివడని రాగగ్రంథుల్ని పెనవేసుకొని వుంది.

రవీంద్రునకు పూర్వం కథారంగంతోపాటు నవలా రంగంలోనైతం బంకిమ్‌చంద్రుడు శరపరంపరలుగా వ్రాస్తూ వచ్చాడు. రవీంద్రునికంటే బంకిమ్‌చంద్రుడు 32 సంవత్సరాలు పెద్దవాడు. సాహిత్య రంగంలోనూ ఆ పెద్దరికం సంపాదించుకున్నాడు.

అయినా రవీంద్రుని టైము వచ్చేటప్పటికి బంకిమ్ నాటి పరిస్థితులు మారాయి. బంకిమ్ రచనలకు స్వదేశం – స్వజాతి, సంఘసంస్కారం– యివి ఆశయాలు. రవీంద్రుని సమకాలీన పరిస్థితులు యింకో అడుగు ముందుకేసి అంతర్జాతీయం, విశ్వబంధుత్వం, యివి రాజకీయానికి వస్తువులయ్యాయి. రవీంద్రుని రచనల్లో దేశప్రేమ లేదనికాదు. 'నాలుగు అధ్యాయాలు' 'యింటా–బయటా' నవలల్లో విశ్వప్రేమతోపాటు దేశప్రేమలుకూడా సృష్టినందు నందుకున్నాయి.

రవీంద్రుని తొలి నవల 'బౌఠాకురానీర్ హాట్'. రెండోది 'రాజర్షి' బాగా సిద్ధి ప్రసిద్ధిపొందింది. 'కంటిమెరమెర' 'పడవ మునక' 'గోరా' 'యోగాయోగ్' 'శేషేర్ కవిత' మొదలైనవి కూడా బాగా ఖ్యాతి నార్జించుకున్నాయి.

'కంటి మెరమెర' సామాజిక నవల. ఇందు ప్రాచ్య పాశ్చాత్య ఆదర్శాల సమన్వయం కుదిరిందన్న విశిష్టత మరొకటి కనిపిస్తుంది. ఇందు ఆశ, బిహారి, మహేంద్ర, వినోదిని ప్రముఖపాత్రలు. ఈ పాత్రల మధ్య అనేకం సమ

స్యలు: అనేకం వైషమ్యాలు, అంతర్ద్వంద్వాలు. మహేంద్రు నిది ఉద్భ్రాంత పరిస్థితి. సదా ఉన్మత్తుడు. వినోదిని పాత్ర యెడ అతని ఉద్వేగాలన్నీ చప్పబడి పోతుంటాయి. వినోదిని విషయ వాంఛ తృప్తి తీరనట్టిది. ఆమె సెక్సు జీవితం పూర్ణంగా భోగ్యం కావడానికి వెనుకంజ వేస్తుంది అందుకని ఆమె సెక్సు జీవితం ఆమె వ్యక్తిత్వాన్ని అనేకమైన చిక్కుల్లో చిక్కుస్తుంది. మహేంద్రి సెక్సు జీవితం వినోదినికీ-వినోదిని సెక్సు జీవితం మహేంద్రకు భోగ్యాలే అయినా, వొకరి నొకరు చేరుకోలేరు. సదా అతృప్తి వాళ్ళను పీడి స్తుంది. ఎలాగో ధైర్యంచేసి వినోదిని మహేంద్రునిమీద తన ప్రేమజాలాన్ని విసరనే విసురుతుంది. మహేంద్రుడు దుర్బలు డని తెలిశాక అతనిమీద ఆధారపడ్డం శ్రేయస్కరం కాదని విరమించుకుంటుంది. తిరిగి బహారిని ఆకర్షిస్తుంది. బహారి పాదపద్మాలను తన వక్షస్థలంమీద అలంకరించుకొంటుంది. కాని బహారి ఆమెను ఉపేక్షిస్తాడు. అతడు చలించని యోగి. గంభీరుడు. వినోదిని తన గుప్త వాంఛలను అతని ఎదుట పెడుతుంది. బహారి విశుద్ధ హృదయంలో ఆమెను వొప్పుకుం టాడు. వినోదిని తనప్రేమను సార్థకం చేసుకోడానికి అతన్ని ప్రేమించలేదు ఆమె, ప్రేమ పరిణతిలో పరిణయం చేసుకో నుబలాటపడింది. తనకు తానుగా అకస్మాత్తుగా అంటుంది "ఛీఛీ, యీమాట గుర్తొస్తుంటేనే సిగ్గేస్తోంది. నేనువితంతువును. నింది తము పతితను సమాజం ఎదుట నిన్ను (బహారి) అవమా నించలేను వితంతువుతో వివాహం మాడతారా? అలా చెయ్య కండి" ఉద్రేకపడుతుంది.

వినోటని తీరని కోరిక—కామతృప్తి పతితల హృద యాల్లో కలకాలం కలవరం పెడుతూనే వుంటుంది. పతితలకు ఆమె ఎడ సానుభూతి కలుగుతూనే వుంటుంది.

'పడవ మునక' రోమాంటిక్ రచన. ఇందలి కథా వస్తువు దైవీ సంఘటనలతో కూర్చబడి 'కంటి మెరమెర' లాంటి సైకాజీలని ప్రవేశపెట్టలేకపోయింది.

రవీంద్రుని మరోపేరున్న నవల 'గోరా.' మధ్య తర గతి కుటుంబాలోని విద్యావంతుల కథ. కొత్త ధర్మంకోసం కొత్త ఆదర్శం కోసం తర్క-వితర్కాలు చేస్తుంటాయి వ్యక్తి గత జీవితంతోపాటు సామాజిక జీవితంకూడా సంవేద్యంగా రూపొందించబడింది. ప్రతి పాత్రకు తన ప్రత్యేకమైన ఫిలా సఫీ అంటూ వుంది వినయ్ భావుకుడు. గోరా ఆత్మబలం వున్న ధీశాలి. అతనిలో స్ఫూర్తి - ఓజస్వితలు అతని పాత్రోచిత గుణాలు. బ్రిహ్మసమాజంమీద సమాజంలో లేచిన తర్క కుతర్కాలకు చక్కని సమాధానాలు ఈ నవల్లో పొందుపర్చాడు రవీంద్రుడు.

'శేషేరకవిత' కావ్యాత్మకమైన నవల. రసోపలబ్ధి ప్రధానమైన రచన. కావ్యం లాంటి ఔదార్యం—అర్థగౌరవం పూర్ణంగా ప్రస్ఫుటితమయ్యాయి.

నాటికలు

"ఇది మహాకావ్యానికి - మహానాటకానికి తగిన యుగంకాదు. ఈ యుగం చిన్నచిన్న నాటికలు చిన్న చిన్న కావ్యాలు కావాలంటోంది. అవే అందిస్తున్నాను" రవీం ద్రుని సమాధానం.

"మహాకావ్యాలు సప్తాంకాల నాటకాలస్థానాన్ని నవల ఆక్రమించింది. అందుకని నవల్లే వ్రాస్తున్నాను చిన్నచిన్న కథలే వ్రాస్తున్నాను." రవీంద్రుని మరో సమాధానం.

లాక్షణికంగా వ్రాయాలి - లాక్షణికంగా బ్రతకాలని కాంక్షించిన వ్యక్తికాదు రవీంద్రుడు. జీవితాన్నో అంతర్జాతీయ క్యాంపుగా భావించి అందుకని పనికట్టుకొని శాంతి నికేతనాన్ని స్థాపించుకొన్నాడు. అది ఆయన అంతర్జాతీయతకు ప్రయోగశాల. అదేకాదు - తాను వ్రాసిన ప్రతి వస్తువూ మరో శాంతినికేతనంలా - అదొక అంతర్జాతీయ క్యాంపులా చల్లని వటవృక్షంఅయి కూర్చుంది.

రవీంద్రునకు పూర్వం వంగసాహిత్యంలో దీనబంధు, మైకేల్ మధుసూధన దత్తు, గిరీశ్ చంద్ర, డి. యల్. రాయ్ ప్రభృతులు విశాలకాయ నాటకాలు నిర్మించారు. వీరిది షేక్స్పియర్ శైలి. గ్రీక్ ట్రాజెడీలు - ఎలిజబెతిన్ నాటక లక్షణాలు పుష్కలంగా ప్రస్ఫుటించాయి. రవీంద్రుని ఆగమనంతో వంగ నాటకరంగంలో షేక్స్పియర్ శైలి, ఎలిజబెతిన్ నాటక లక్షణాలు పూర్తిగా విలుప్తమైపోయి మోడరన్ థియేటర్, యాంటీ థియేటర్ లక్షణాలు చోటు చేసుకొన్నాయి సంస్కృత నాటకలక్షణాలు ఏనాడో లోపించి పోయాయి వంగసాహిత్యంలో. సంస్కృత పద జాలాన్ని అంటిపెట్టుకున్నా - సంస్కృత శాస్త్రాన్నిమాత్రం అందుకోలేదు వంగభాష. వంగ నాటకరంగం పశ్చిమ పద్ధతిలో పురోగమించింది.

రవీంద్రుడు మనోవైజ్ఞానిక రచయిత కావడంతో

ప్రాచీన పరంపర సంస్కారాలను కాదని ఆధునిక మన సత్వ సంస్కారాలతో మనోగ్రంథుల నున్మీలనచేస్తూ ప్రతిదీ వ్రాశాడు. ఆయన నాటికలకుసైతం మనో విజ్ఞానమే మూల మైంది. తనసూక్ష్మ అంతర్దృష్టితో మానవుని మూలప్రవృత్తులైన ప్రేమ – కరుణ – ఈర్ష్య – ద్వేషం – దయ–మమత–వాత్సల్యం – పరదుఃఖ కాతరత వంటి ప్రవృత్తుల్ని నాటికల్లో కలిపివేటు చేశాడు. ఈ విధంగా అన్‌హీరోయిక్ వస్తువుని – పాత్రలను తీసుకోవడంతో యాంటీ స్టోరీ – యాంటీ థియేటర్ తయారైంది ప్రాచీన పద్ధతులకు స్వస్తి జరిగింది. రససిద్ధాంత స్థానంలో స్వానుభూతి ప్రతిష్ఠించుకొన్నారు—వారి నూతన రసాభినయ చతురతను స్వాభినయంతో ప్రవేశపెట్టాడు.

'వాల్మీకి ప్రతిభ' రవీంద్రుని తొలినాటిక.. రవీంద్రుడు స్వయంగా వాల్మీకి భూమికను ధరించాడు. శాంతినికేతనం బాలికలు యితర పాత్రలు ధరించారు. ఆయన అభినయం కవి హృదయంలోని ఆనందోల్లాసాల చిన్మయ భావ భంగిమగా ప్రత్యక్షమయ్యేది. ముక్తగీతం, వైష్ణవరాగం, సంవాదనృత్యం, ఐరిష్ సంగీతం యివన్నీ లోకాతీతమైన ఆనందాన్ని కళ్ళముందు ప్రతిష్ఠించేవి.

వాల్మీకి ప్రతిభతోపాటు కాలమృగయా' 'ప్రకృతిర ప్రతిశోధ' మాయారంబేల యిత్యాది నాటికలు సంగీత ప్రధానంగా సృష్టించబడ్డాయి. వీటిని సంగీతనాటిక లనవచ్చు. వాల్మీకి ప్రతిభ, కాలమృగయా వస్తుపరంగా రామాయణం మీద బేసై వ్రాయబడ్డాయి. కాలమృగయ నాటికలో దశ

రథుని ద్వారా అంధ ముని పుత్రుడైన శ్రవణకుమార వధ దృశ్యాన్ని కరుణార్ద్రంగా ప్రవేశ పెడతాడు.

'ప్రకృతిర ప్రతిశోధ' నాటికలో మరో కొత్తసృష్టిని మనముందు వుంచుతాడు. వొక సన్యాసి యిందు ప్రధాన పాత్ర. సన్యాసి సంసార బంధనాల కతీతంగా యింద్రియాలను జయించాలనే మహాకాంక్షతో నిర్జనప్రదేశానికి పయనిస్తాడు. మార్గమధ్యంలో వొక అనాథ బాలిక ఎదురౌతుంది. ఆమె దీనస్థితి ఆ సన్యాసిని సంసారిగా మార్చివేస్తుంది. 'నాన్నా' అని పిలుస్తుంది. ఆ పిలుపుతో సన్యాసి హృదయం స్నేహవాత్సల్యాలతో బరువెక్కి తిరుగుముఖం పడుతుంది. రవీంద్రుని ఏ నాటిక పరికించినా, దయ, మమత, వాత్సల్య గుణాలు—కఠోర తపస్సు, ప్రాచీన సంస్కారాల అనుశాసనం, నానావిధి విధానాలను ఢీకొని - ఘర్షణపడి అంతంలో గత్యావస్థాయీ భావాలుగా నిలచిపోతాయి. అడుగడుక్కీ క్రూరత్వాన్ని, కాఠిన్యాన్ని జయించిన కారుణ్య గుణాలు మెరుస్తుంటాయి 'వాల్మీకి,' 'సన్యాసి' పాత్రల అంతర్ద్వంద్వం - పరిస్థితుల సంఘర్షణ నాటక రచనలందు పేర్కొనదగినవి. నాటక సఫలతకు సంఘర్షణ పరిస్థితులు ప్రధానంగా చెప్పబడతాయి.

'రాజావోరాణి' 'విసర్జన' లాంటి నాటక రచనలు సంఘటనా క్రమంలో విషయ వస్తువును సంతరించుకొన్నాయి త్రిపురేశ్వరి ఆలయంలో వంశపారం పర్యంగా పశుబలి జరుగుతూ వస్తున్నది ఈ పశుబలిని అరికట్టే సాహసం ఎవ్వరూ చెయ్యలేక పోతున్నారు. అపర్ణ అనే బాలిక

పశుబలికి విరుద్ధంగా గొంతు విప్పుతుంది. ఆమె పెంపుడు మేక పిల్ల బలిపీఠం మీదకు తీసుకు రాబడుతుంది. అపర్ణ అశ్రు నయనాలతో రాజు ఎదుట ప్రత్యక్షమౌతుంది. ఆలయ సేవకుడు జయసింహ బాలిక కాతరదృష్టికి కరిగిపోయి వ్యధితుడౌతాడు. అతన్ని విశ్వజనీన ప్రేమ సందిగ్ధంలో పెడుతుంది. రాజు పరిస్థితీ అంతే అవుతుంది. ఆ రోజునుండి బలినిషేధాజ్ఞ అమలుజరుగుతుంది. ఈ నిష్కర్షతో రచనాంతం జరుగుతుంది. పురోహితుడైన రఘుపతి క్రోధం, ధర్మ వినాశనం జరుగుతున్నదనే మంత్రివర్యుల భయాలు, యువరాజైన నక్షత్రరాయ్, ప్రజలు, ఏం ఆపద రానున్నదోననే భయాందోళన చెందడం లాంటి ఘట్టాలు రచనలో తీవ్ర సంఘర్షణాలు ప్రవేశపెడతాయి మానసిక సంఘర్షణ లేకుండా రవీంద్రుని రచనంటూ జరగ లేదు.

బాహ్య సంఘర్షణాలు అప్రధానాలు అవి సైకాలజీకి సంబంధించినవి కావు అంతతో గత్యా రవీంద్రుని రచనలు బౌద్ధమతంలోని మహామైత్రి—మహాకరుణను సాధించి తీరుతాయి. పరోక్షంగా హిందూ ధర్మంలోని యజ్ఞక్రతుల్ని సమూలంగా వ్యతిరేకించి బౌద్ధధర్మ వాతావరణాన్ని ప్రవేశపెడతాడు.

'విసర్జన' నాటక రచనకూడా యిదేవిధంగా నిరర్థక నిష్ఠురమైన సంస్కారాలను - ఆచారాలను ప్రతిఘటిస్తుంది. చివరకు బౌద్ధ సంస్కారంతో ఊపిరి పీల్చుకొంటుంది విశుద్ధ హృదయాల నొకవైపు, అంధభక్తుల నొకవైపు చేర్చి సంఘర్షణ ప్రారంభిస్తాడు. ఆ సంఘర్షణ్ణి విశ్వవ్యాప్తం గావించి

చివరకు దయాదాక్షిణ్యాలను జయింపజేసి విశ్వధర్మాన్ని స్థిరపరుస్తాడు.

'మాలిని' రచనలోని రాజకన్య మాలిని బుద్ధభగవానుని ధర్మదీక్ష గైకొంటుంది. ఇక ఆమెను బంధించగల రాజగృహమంటూ వుండదు, ఆమే వాక విశ్వంగా-విశ్వమే ఆమెగా చొచ్చుకుపోయి విశ్వవిశాలమైపోతారు.

రవీంద్రుడు నాటక రచనలద్వారా పరం పరాగతమైన సనాతన ధర్మాన్ని ప్రతిఘటించి విశ్వవ్యాప్తంగా పనికి వచ్చే మానవధర్మాన్నొకదాన్ని బౌద్ధరూపంలో ప్రతిష్ఠిస్తాడు.

రవీంద్రుడు సమకాలీన పరిస్థితుల నెదుర్కొంటూ మరోరకమైన వ్యంగ్య నాటికలు వ్రాశాడు రవీంద్రుడు సమాజంలోని దుర్బల, సంకీర్ణ, మిథ్యాచరణాల్ని నిర్మూలించడానికని వ్యంగ్యకౌతుకాలు, హాస్యకౌతుకాలు రచించాడు. యివన్నీ వీరేశలింగంగారి ప్రహసనాలు లాంటివి. ''వైకుంఠేర కాతా', 'గోడాయగలద' 'తాసేర దేశ్' శారదోత్సవ' 'ఫాల్గుని' 'రక్తకబరీ' యిత్యాదులు ప్రసిద్ధ ప్రహసనాలు. 'డాక్ఘర్' అదొక ప్రత్యేకమైన ఆధ్యాత్మిక రచన. ఆత్మ పరమాత్మల సమ్మేళనం అంతర్యామితంగా వుంటుంది.

'నటీరపూజ', 'శాపవిమోచన,' 'చిత్రాంగదలు' నృత్యనాటికలు, భావవ్యంజన, భావముద్రలు సూక్ష్మాతి సూక్ష్మంగా మూర్తిమంత మయ్యాయి. నృత్యసంగీతాల ద్వారా రవీంద్రుడు సూక్ష్మానుభూతుల్ని, భావగ్రంథుల్ని అభివ్యక్తం చెయ్యడంలో సిద్ధహస్తు డయ్యాడు.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPGAD2B159 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 91 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1TO8 |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Thasin |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |